# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వర వేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1 - 25 న.పై.

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3 - 10   6 ఔ॥ రు. 5 - 50

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3 - 0

## సౌభాగ్య శొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమను ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2 - 0

## ప్రమేహాంతకం

(తెల్లబట్ట వ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4 - 0

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశ్‌కు ఏజంట్లు:

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు.



# తిరస్కరించలేని జన్మ హక్కు . . .

" దేవాలయ ప్రవేశము పరమ పవిత్రమైన పని. "అస్పృశ్యులకు" అది స్వాతంత్ర్య సందేశము. తాము దేవునినుండి వెలివేయబడ్డవారము కామనే విశ్వాసాన్ని ఇదివారికి కలిగిస్తుంది."

—మహాత్మా గాంధి.

భారత రాజ్యాంగం
అస్పృశ్యతను నిషేధించింది.
పైగా జాతి మత వివక్షతలు లేకుండా
అందరకు సమాన సాంఘిక పౌరసత్వ
హక్కులను ప్రసాదించింది.

**అస్పృశ్యతను
నిర్మూలించండి
సమానతను
నిలబెట్టండి.**

DA 58/245

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౯] ఏప్రెల్ 1957 [సంచిక ౮



మద్రాసు - షెనాయ్‌నగర్‌లో శ్రీ సాయి నిలయం ఆధ్వర్యాన జరిగిన శ్రీరామనవమి ఉత్సవాలనాడు అధ్యక్షత వహించిన మంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యం, స్వామి కేశవయ్యాజీ శ్రీ సాయిబాబా ఆరాధనా మందిరములో నున్నప్పటి ఛాయా చిత్రము.

# వి ష య సూ చి క




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతీమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---



## ఎన్నికల ఫలితాల గుణపాఠం

మన దేశంలో మొన్న జరిగిన జనరల్ ఎన్నికలు ప్రజలకు నాయకులకు అనేక గుణపాఠాలు నేర్పియుండాలి.

పదిసంవత్సరాల కాంగ్రెస్ పరిపాలనలో అపరిష్కృతంగా నిలబడిపోయిన ప్రజల ప్రధాన సమస్యలు యీ నాడైనా కంటబడియున్నచో సంస్థగా కాంగ్రెస్, వ్యక్తిగతంగా అందలి సభ్యులు ముందు ముందుకైనా జాగ్రితపడడానికి అవకాశ ముంటుంది. ప్రిజాసమస్యలను, ప్రిజావసరాలను నిర్లక్ష్యంచేసి తమ యిచ్చవచ్చిన రీతులలో ప్రిభుత్వ సారధ్యాన్ని వహించగలమని ఎవరనుకున్నా పగటికలయే కాగలదు.

దేశంలో అధిక సంఖ్యాక రాష్ట్రిలలో కాంగ్రిస్ మంత్రి వర్గాలే ఏర్పడు అవకాశములు సమకూరినా కాంగ్రిస్ ప్రిజలలో మునుపటంత అభిమాన, విశ్వాస పాత్రింగా లేదని ఎన్నికల ఫలితాలు, కేరళ రాష్ట్రింలో జాతీయ శక్తులు నాయకత్వ మును కోల్పోవుట నిరూపిస్తున్నవి.

పదిసంవత్సరాల కాంగ్రిస్ పాలనలో తమ నిత్య జీవిత సమస్యలు యథాతథంగా క్లిష్టముగా నేయున్నప్పుడు కమ్యూనిస్టునాయకత్వమైనా పరిస్థితులను చక్క-బెట్టకలదేమో

చూద్దామని దాని క్రిందికి ప్రజలు కేరళలో చేరిరేమో! ఎన్నికల అదనులోమాత్రం కల్ల బొల్లి కబుర్లతో సర్వశక్తి సంపదలను వినియోగించి ప్రజలను జోకొట్టి ఓట్లు సంపాదించ ప్రయత్నించినవారు అక్కర తీరిన తరువాత ప్రజల శ్రేయోపురోభివృద్ధులపట్ల ఆసక్తి చూపక, అభ్యుదయ నిరోధకులుగా వ్యవహరించే వ్యక్తులను కలకాలము ప్రజలు ఉపేక్ష చేయగలరనుకొనుట భ్రమ; పైగా అట్టి వ్యక్తులకు స్థానమిచ్చిన పార్టీ సయితము పేరు ప్రతిష్ఠలను క్రమంగా కోల్పోయి ప్రజలకు దూరమైపోగలదు. దాని ఫలితంగా మహత్తరమైన గతచరిత్రగల రాజకీయపక్షాలు సయితం తెరమరుగుకు పోక తప్పదు.

ప్రజా ప్రాతినిధ్యము వహించ పూనుకొనిన ఏపార్టీయైనా తన సభ్యులు ప్రజాభీష్టానుసరించి ప్రజల సమస్యలను, అవసరాలను అర్థంచేసికొని ప్రజాహితాన్ని ప్రోత్సహించునట్లుగా చేయకలిగిననాడే దాని నాయకత్వము బలీయము, ఉపయుక్తము, ప్రజాదరాభిమానములకు పాత్రము కాగలదు.

ఎన్నికలలో కొంతవరకు స్వతంత్రులకు తమ ఓటమి గుణపాఠమయినా పార్టీలుగానే శాసన సభలలో ప్రజాభిమతాని కనుగుణంగా సాధించలేని అభివృద్ధి అభ్యుదయాలను స్వతంత్రులు ఎవరికి వారు చేయకలిగింది లేకపోగా, అధికార వ్యామోహపరులకు కీలుబొమ్మలై ప్రజలకు మేలుకంటె కీడే అధికంగా చేయగలరని ప్రజలు గుర్తించాలి.

ఈ సందర్భమున ఎన్నికలలో గెలుపొందిన ప్రజాప్రతినిధులను - ముఖ్యంగా మహిళామణుల నభినందిస్తూ ప్రభుత్వ నిర్వహణ బాధ్యతలలో కేంద్రంలోను, రాష్ట్రాలలోను సముచిత ప్రాతినిధ్యము స్త్రీలకు లభించగలదని ఆశిస్తున్నాము. పురుషులతో సమానంగానో లేక మెరుగుగానో నిర్వహించగల శాఖలలో విద్య, ఆరోగ్యం, ప్లానింగ్ అభివృద్ధులు లాంటివాని మహిళలే నిర్వహించడం జాతీయ శ్రేయస్సుకే అనేక విధాల ఉపయోగకరము.

పండిత జవహర్లాల్ నెహ్రూ నాయకత్వము క్రింద సుస్థిరమైన, ప్రజానురంజకమైన ప్రభుత్వము ఏర్పడుటయేకాక జాతీయశక్తులలో సయితం విశాల దృక్పథం, సమరస సమైక్యతలు ఏర్పడి యావద్భారతానికి బలీయమైన జాతీయనాయకత్వము సమకూరాలని ఆశిస్తున్నాము.

# శ్రీ రామనవమి మహోత్సవము

మద్రాసులోని షెణాయ్ నగరమందలి శ్రీసాయి నిలయంలో శ్రీరామనవమి మహోత్సవం వైభవోపేతంగా జరిగెను. 7వ తేదీ ఆదివారమునాడు ఉదయం 11 గంటలనుండి మూడువేలమంది బీదలకు అన్నదానము జరిగెను.

శ్రీరామనవమి నాడు సాయంకాలము శ్రీరామ భజన, ఆరాధనలతోబాటు విద్యుద్దీపాలతోటి, తోరణములతోటి అలంకరించబడిన శ్రీసాయినిలయం ఆవరణలోని పండిట మద్రాసుమంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతన బహిరంగ సభ జరిగెను. దివాన్ బహదూరు కే. యస్. రామస్వామిశాస్త్రి, శ్రీ టి. పురుషోత్తం, శ్రీ యం. రామానుజాచార్య గారలు ఉపన్యసించిరి.

స్వామి కేశవయ్యాజీ యీ సందర్భమున భక్తులకు స్వాగతము చెప్పుచు శ్రీసాయిబాబా భజనమందిర నిర్మాణమునకై స్థలం యిప్పించవలసినదిగా కార్పొరేషన్‌నుకోరి శ్రీరామచంద్రుని అవతారపురుషుడుగా మనము ఆరాధించి పూజిస్తున్న ఆయన అవతారమైన శ్రీ సాయిబాబాను పరిశుద్ధ ఆత్మతో ఆరాధించి, భూతదయ, సత్యసంధత, మానవ సేవ, ప్రేమ, త్యాగములద్వారా శ్రీ బాబా కరుణాకటాక్షములతోబాటు భగవత్ సాక్షాత్కారము సయితము లభ్యము కాగలవు అని వివరించి యీ క్రింది దివ్య సందేశమును పూరించిరి.

పరిత్రాణాయ సాధూనామ్
వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ-సంభవామి
యుగేయుగే॥
యదాయదాహి ధర్మస్య
గ్లానిర్భవతి భారత
అభ్యుద్ధాన మధర్మస్య
తదాత్మానం సృజామ్యహమ్॥

అను గీతావాక్యము ననుసరించి ప్రపంచంలో ధర్మచ్యుతి కలిగినప్పుడు దుష్టశిక్షణ, శిష్టరక్షణ నిమిత్తమై భగవంతుడు భూమిపై అవతరిస్తుంటాడు. రామకృష్ణాది అవతార మూర్తులు లోక సంగ్రహార్థం పైవిధంగా భువిలో నవతరించినవారే. అట్టి అవతార మూర్తులలో త్రేతాయుగమున జన్మించిన శ్రీరామచంద్రుని జీవితము మానవకోటికి అన్ని విధాలా ఆదర్శప్రాయమైనది.

శ్రీరాముడు పితృభక్తి పరాయణుడు. సత్యవాక్పరిపాలనాదక్షుడు. ఏకపత్నీవ్రత నిష్ఠాగరిష్ఠుడు. శరణాగతరక్షణ తత్పరుడు. భక్తవత్సలుడు. ప్రజానుకూలుడు. పై గుణములన్ని శ్రీరాముని జీవితంలో సంపూర్ణంగా ప్రకాశించినవి. స్వప్రయోజనపరుడు కాకుండా తన విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించడమే మానవుని మహోత్కృష్ట ధర్మమని పదునాలుగేండ్ల వనవాసంద్వారా శ్రీరామచంద్రమూర్తి ప్రపంచానికి సువిదితం చేశాడు. శ్రీరాముని మాటలలో చేతలలో నిస్వార్థత తొణికిసలాడుతుంది. త్యాగం ఆయనలో మూర్తీభవించింది. అందుచేతనే శ్రీరామచంద్రుని పవిత్ర జీవితం అశేష ప్రపంచానికి, ఆ చంద్రార్కంగా ఆదర్శప్రాయమౌతున్నది. విశేషించి, రాగద్వేషాలతో, పరస్పర సంఘర్షణలతో సంక్షోభం చెందుతున్న నేటి మానవకోటి తరించడానికి పరమపావన మూర్తియైన శ్రీరామచంద్రుని గుణానుకీర్తనంకంటె, మహనీయమైన ఆయన

జీవితాదర్శాలను అనుసరించడం కంటె ఉత్తమమార్గంలేదు.

ఒక్క శ్రీరాముడే కాదు. రామాయణంలో ఆదికవి వాల్మీకిచే పోషించబడిన ప్రధానపాత్రలు—సీత, లక్ష్మణుడు, భరతుడు, హనుమంతుడు, విభీషణుడు మొదలైన వారందరు రామభక్తులే కాక ఒక్కొక్క విశిష్ట ధర్మానికి ఆదర్శమూర్తులు. జీవితానికి సంబంధించిన వివిధావస్థలలో మానవుడు ఏవిధంగా నడుచుకొనవలెనో, ధర్మవ్యతిరిక్తం లేకుండా తన కర్తవ్యాన్ని ఎలా నిర్వర్తించవలెనో రామాయణంలోని పాత్రల శీలాదులవల్ల, వేర్వేరు సంఘటనల ద్వారా మనం గ్రహించవచ్చు. ఒక్కమాటలో రామాయణం రత్నాకరం వంటిది. రామాయణ పఠనం, రామ గుణానువర్ణనం, రామనామోచ్చారణం సమస్త పాపములను హరించి, ఇహపరములు రెంటిని సమకూర్చగలవు.

ముఖ్యంగా, శ్రీ సాయిబాబా భక్తులకు నేడు మిక్కిలి సుదినము. బాబా శ్రీరాముని అపరావతారమని లోకప్రసిద్ధి. "కృష్ణ, రామ, శివ, మారుత్యాది రూపాయ" అని బాబాను స్తుతిస్తారు. శ్రీ బాబా సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపమే అయినప్పటికీ "యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః" అను న్యాయానుసారంగా, మానవ ప్రబోధం నిమిత్తం శ్రీసాయిబాబా తన జీవితకాలంలో శ్రీరామనవమి మహోత్సవాలలో అత్యంతశ్రద్ధాభక్తులతో పాల్గొనేవాడు. తద్వారా, శ్రీ బాబా అనేకత్వంలో నుంచి ఏకత్వాన్ని, సర్వమత సామరస్యాన్ని, సర్వమానవ సౌభ్రాత్రాన్ని కూడా సాధించగలిగాడు.

ఇన్ని విధాల అత్యంత పవిత్రమైన ఈ నాడు మన మందరము శ్రీరాముని లోకోత్తర జీవితంలోని మహోన్నత నైతిక సూత్రాలను మననం చేసుకుని, శక్తివంచన లేకుండ వానిని ఆచరణలో పెట్టడానికి కృషి చేయవలసియున్నది. అందుచే మన ఆత్మలు అచిరకాలంలో పరిశుద్ధం కాగలవు. విషయవాసనలు మనలను తొలగిపోగలవు. అరిషడ్వర్గాలను క్రమంగా మనము జయించగల్గుదుము. కడకు మన జీవితములు సార్థకత చెందగలవు.

ఓం శాంతి, శ్శాంతి, శ్శాంతిః

వైస్ ప్రెసిడెంటు డా॥ రాధాకృష్ణన్, శ్రీ శ్రీప్రకాశ, శ్రీ బి. యన్. దాతర్, శ్రీ నీలం సంజీవ రెడ్డిగారల సందేశములు చదువబడెను.

శ్రీ పురుషోత్తంగారు ఉపన్యసించుచు శ్రీరామనవమి ఉత్సవముయొక్క ప్రాముఖ్యమును వివరించుచు శ్రీరామచంద్రునివలెనే అవతారపురుషుడైన శ్రీ సాయిబాబా కరుణాకటాక్షములను పీడిత ప్రజానీకానికి అందించి నిర్విరామంగా స్వార్థరహితమైన సేవ చేస్తున్న స్వామి కేశవయ్యజీ స్తుతిపాత్రుడనియు, శ్రీబాబా సందేశము స్వామిజీద్వారా విస్తారంగా వ్యాపించి ప్రజలకు ఇహపరసుఖాలు సమకూరా

లని అన్నారు. శ్రీ బాబా ఆలయ నిర్మాణమునకు ప్రజలే పూనుకోవాలనియు, అందుకు కావలసిన కొన్ని సౌకర్యాలు, వసతులకొరకు ప్రభుత్వమును కాని, కార్పొరేషన్‌ను కాని అర్థించడం సబబుగా నుండగలదన్నారు.

శ్రీరామస్వామిశాస్త్రిగారు రామాయణగ్రంథము యొక్క ప్రాశస్త్యాన్ని వివరించుచు మానవకోటికి ప్రతియొక్కరికి తమ జీవయాత్రలో రామాయణమూల గ్రంథము చుక్కానిలాంటిదన్నారు. శ్రీసాయి నిలయంపై 'ఓం శ్రీ సాయిరాం' పదములతో విద్యుద్దీపముల నలంకరించి యున్నదానినిగురించి ప్రస్తావించుచు ఉత్తమోత్తమ ఆదర్శలక్ష్యాలను, పవిత్ర జీవితాన్ని, ముక్తిమార్గాన్ని ప్రబోధించిన అవతార పురుషులు శ్రీరామచంద్రమూర్తి, శ్రీ సాయిబాబా అనియు, వారిననుసరించి, ఆరాధించి, భక్తి విశ్వాసముల ప్రకటించుటవలన ఐహికాముష్మిక సుఖములు అబ్బగలవని - న్యాయానికి, ధర్మానికి నిలయమై ప్రజలు సుభిక్షముగానున్న ఆ నాటి 'రామరాజ్యం' యీ నాడు సయితం ఏర్పడాలని వాంఛిస్తున్నానని, స్వామీజీ మానవ సేవను ప్రశంసించారు.

మంత్రి శ్రీ సుబ్రహ్మణ్యంగారు ఉపన్యసిస్తూ తానీరోజున శ్రీ సాయిసన్నిధిన శ్రీ రామనవమి ఉత్సవంలో పాల్గొనకలుగడం అదృష్టమని చెప్పి తను చూడకలుగనిదానిని, తనకు తెలియనిదానిని లేదనడమెట్టిదో భగవంతుడు అందరికీ కనుపించుట లేదు కాబట్టి లేడనడమట్టిదేననియు, భగవంతుని పట్ల నమ్మకంలేనివారిది ఒకేమార్గంకాగా నమ్మకమున్నవారు వివిధ వార్గాలుగాచీలి పోయి వైషమ్యాలతో అనైక్యతకు గురికాకుండా అన్నిమతాలవారు సోదరభావంతో స్వీయ శాంతి సౌభాగ్యాలను తీర్చి దిద్దుకోడానికి స్వామి కేశవయ్యాజీవంటి దివ్యపురుషులు తోడ్పడగలరని చెప్పి నిజమైన రామరాజ్య స్థాపనకు ప్రభుత్వాధినేతల కర్తవ్యముకంటె సామాన్యప్రజల కర్తవ్యము, బాధ్యతలు మెండనియు, ప్రజలలో ద్వేషము, అసూయ, స్వార్థము, ఆధిపత్యవాంఛలు సన్నగిలి పరోపకారేచ్ఛ, సానుభూతిసద్భావాలు, సహకారము, దయ, సత్యాహింసలు పెంపొందిననాడు యీ నాటికంటె సంఘము మెరుగైనస్థాయిలోనుండి 'రామరాజ్య' స్థాపన శరవేగంగా జరుగడానికి ప్రజలు తోడ్పడగలరనిరి. స్వామి కేశవయ్యాజీ చేయుచున్న నిర్విరామ సేవా కార్యక్రమము తనకు విశేషంగా తృప్తి కలిగించిందనిరి.

శ్రీ టి. చెంగల్వరాయపిళ్లైగారు వందన సమర్పణయనంతరము స్వామి కేశవయ్యాజీ ప్రతిగురువారం వేలకొలదిగా గుమికూడుతున్న భక్తకోటికి విజ్ఞప్తిచేస్తూ తన్ను ఏమని పిలచినా, తన్నుగురించి ఏమనుకున్నా తనకేమి అంటవనియు, శ్రీబాబా ఆదేశానుసారం తాను చేస్తున్నమానవసేవా కార్యక్రమానికి వచ్చినవారు శ్రీబాబా పట్లభక్తి విశ్వాసాలతో పాటు క్రమశిక్షణ నియమాలను పాటించి శ్రీ బాబా ప్రసాదము, ఆశీస్సులను పొంది తోడ్పడవలసినదిగా కోరిరి.

మహోత్సవంలో పాల్గొన్నవేలకొలది ఆబాలగోపాలమునకు విభూది, వడపప్పు, పానకం, ఫలపుష్పాదులు పంచిపెట్టబడినవి.

'భగవాన్‌దాస్'



# జర్మను

## కథలు, కబుర్లూ

'జర్మానంద'

### నాలుగుకాళ్ల దొంగ!

మొన్న మా పట్నంలో కొత్తరకపు దొంగను పట్టుకొన్నాం. రాజవీధిలో పెద్ద దుకాణం. ఆ నాడే కొత్త ప్యాషన్ టోపీలు వచ్చాయి, వాటిని షో కేసులో చక్కగా సర్దారు. దోవలో అటూ నడిచేవాళ్లూ, ఇటూ నడిచేవాళ్లూ ఈ కొత్త పాషన్లని చూస్తూ ఆశ్చర్య పడుతూ వున్నారు. వాళ్లలో ఒక దొంగ వున్నాడు. వాడు ఆ షో కేసుని చూశాడు. ఎంతోసేపు చూశాడు. వాళ్లూ వీళ్లూ చూడనప్పుడు టోపీలలో మంచిదాన్ని కాజేయాలని పెద్ద ఎత్తును వేస్తూ వున్నాడు. ఈ వ్యక్తి వాలకాన్ని లోపల నుంచి అంగడి మనిషి చూశాడు. వాడు వస్తువును కాజేయకముందే వాణ్ణి పట్టు కోవాలని ఆ అంగడి మనిషి ఎత్తు వేస్తూనే వున్నాడు. ... దొంగ టోపిని నోటికి లంకించుకున్నాడు. అదే సమయమను కుని అంగడి మనిషి టోపిని గట్టిగా లాగే శాడు. ఆ కసరత్తులో టోపీ చినిగి పోయింది. దొంగ జనంలో మాయ మయ్యాడు.

దూరాన్నుంచి చూడడానికి ఆ వ్యక్తి మనిషిగా కనబడ్డా వాడు మనిషి కాడు కుక్క. ఇలాటి పనులలో బాగా శిక్షణ బడసిన కుక్క. కుక్క యజమాని ఆ దొంగతనాలకు కుక్కని ఇటు పంపాడు. ఆ అంగడిలో నాలుగయిదు నెలలనుంచి టోపీలు, మరి ఇతర అమూల్యమైన వస్తు వులు మాయమవుతూ వుండేవి. పోలీసు లకు రిపోర్టు చేశారు. పోలీసులు ఎంత కట్టుదిట్టాల్లోవున్నా ఎలాటివాటి పత్తాని తీయలేక పోయారు.

ఇప్పుడు రహస్యం బయలుపడ్డది. కుక్క ఎక్కడికి చేరుకుందో తెలిసిపోయింది. దాంతో దాని యజమానుని జాడలూ గుర్తింపబడ్డాయి. ఆ వూళ్లో పోయిన వస్తువుల్లో ఎన్నెన్నో యజమానుని ఇంట్లో దొరికాయి; వాడు పరారు అయిపోయిన గజదొంగ. వాడ్ని అరెస్టుచేయడానికి వారంట్లు వున్నాయి. ఇక వాడ్ని పట్టుకో డానికి కష్టముంటుందా?

### ఆయనను మించినవాడే!

ఆ వూళ్ళో ఒక పెద్దమనిషి వున్నాడు. చెప్పరానంత బద్ధకస్తుడు. తన దగ్గర పని చేయటానికి ఒక అబ్బాయిని కుదుర్చు కున్నాడు. ఆ అబ్బాయి బద్ధకంలో యజ

మాని కన్నా రెండాకులు ఎక్కువగా చదివినవాడే.

యజమాని ఒక రోజున ఏదో తొందర పనిమీద ప్రక్కవూరికి వెళ్లాలసివచ్చింది. నౌకరును తను వేసుకునే పాదరక్షలను సిద్ధం చేసి వుంచమని ఆజ్ఞాపించి, ఆయన తన ముస్తాబు అయ్యాక చెప్పుల్ని వేసుకోబోయాడు. వాటిలో ఒకటి పెద్దది. మరొకటి చిన్నది. "ఇలా చేస్తూ వుంటే పని పాటలు ఎలా నేర్చుకోగలుగుతావు?" అంటూ ఆ పని చేసేఅబ్బాయిమీద పడ్డాడు. కొంప మునిగిపోయిందని ఆ అబ్బాయి తెలుసుకున్నా "చిత్తం, చిత్తం - అయిందేమో అయింది. దానికోసం తమరు కోపపడటం ఎందుకు? ఇలాటి జతనే సామాన్లగదిలో చూశాను. వాటిని తెచ్చి పెడతాను. ఈ పొరబాటు అప్పుడు మీరే చక్కచేసుకుంటారు. మా వూళ్లో పాదరక్షలు వుంటేగా, ఇలాటి చిక్కులను తేల్చటానికి మాకు వీలుండేంది" అంటూ అమాయకంగా అనేసి, తిన్నగా ఆ జతను తీసుకుని రావడానికి ప్రక్క గదిలోకి నడిచాడు.

## దూరదృష్టిగల కుక్క!

నా స్నేహితుడు తను పెంచుతూవున్న కుక్కను షికారుకి తన వెంట తీసుకునివస్తూ వుండేవాడు. ఒక రోజున ఆయనా నేను నది ఒడ్డున నడుస్తూవున్నాం పిచ్చాపాటీ చెప్పుకుంటూ. నది ఆ నాడు బాగా ప్రవహిస్తూవుంది. గిరాటున తన చేతికర్రని ఆ ప్రవాహంలోపడేసి దానిని చప్పున తీసుకుని రమ్మని స్నేహితుడు కుక్కకు ఆజ్ఞ చేశాడు.

గభాలున ప్రవాహంలోకి దూకింది కుక్క. కొట్టుకుని పోతూన్న కర్రని పట్టుకోడానికి ఎంత ప్రయత్నించినా అది చిక్కుతేగా! దాని బుర్రలో ఆ సమయాన ఏం ఆలోచన తట్టిందో నీళ్ళలోనుంచి ఒడ్డుకి వచ్చింది. కర్ర కదలుతూ వున్న వైపునే చూస్తూ ఒడ్డున్నే నడవసాగింది. కర్ర కూడా కొంత సేపటికి నీళ్ళలో నుంచి ఒడ్డుకు చేరుకున్నది. తన పని యథాతథంగా సిద్ధించినందుకు ఆనందంగా అరుస్తూ కర్ర దగ్గరకి గబగబ నడిచింది. దాన్ని నోటికి లంకించుకుని యజమాని దగ్గరికి పరుగిడుతూవచ్చి, తోక నాడిస్తూ, ఆయనికి చేర్చింది.



# శ్రీ సాయిబాబా భక్తుల దివ్య అనుభవాలు

చిరస్మరణీయులు స్వర్గీయ నరసింహస్వామిగారి నిర్విరామకృషి ఫలితంగానే శ్రీ సాయిబాబా దివ్య జీవితము, సందేశము యావద్భారతదేశమునకు తెలియవచ్చెను. శ్రీ సాయిబాబా యిప్పుడు చాలమందిచే అవతారమూర్తిగా ఆరాధించబడుచున్నాడు. ఆయన ఉత్తమోత్తమస్థాయినందుకున్న పుణ్యపురుషుడుగా అనేకులను బాధలనుండి, కష్టములనుండి, దుఃఖములనుండి కాపాడు రక్షకుడైనాడు. శ్రీ బాబా జీవన్ముక్తుడుగా 1918 లో భౌతిక దేహమును చాలించినా ఆనాడు, యీనాడు అనే విచక్షణ లేకుండా పరిగణించ జాలనంత మానవ సేవను ఆయన దివ్యప్రభావము, ఆయన సూక్ష్మ శరీరము చేయుచునే యున్నవి.

స్వామి కేశవయ్యజీ నిరంతర శ్రీ బాబా ధ్యానముతో తమ గురువు శ్రీ బాబా అంశాలను, మహిమను పొంది వానిని నిరంతరము మానవసేవ చేయుటకు, లోక కళ్యాణాన్ని అవిచ్ఛిన్నముగా ప్రోత్సహించగల శ్రీ సాయి సందేశమును వ్యాప్తి నొందించుటకు తన ఆత్మార్పణము చేసిరి. ఉత్కృష్టమైన శ్రీ బాబా జీవిత విశేషములందలి సత్యము, అహింస, దయ, భక్తి విశ్వాసములు, సానుభూతి, సద్భావ, సహకారములు, సౌభ్రాతృత్వము, మానవసేవపట్ల ఆసక్తి, మానవ జీవయాత్రలో యిహ పదాలలో నెట్లుపయోగ పడగలవో అనుక్షణం నిదర్శనాపూర్వకంగా చూపుచున్నట్టి తపస్విస్వామి కేశవయ్యగారు. సహజ మానవ జీవయాత్రలోని స్పర్థలు, వైషమ్యాలు, కష్టాలు, దుఃఖాలు, ఉద్యోగ ధర్మంలో అధిగమించుట సులభసాధ్యముకాదనిపించినా పరిశుద్ధమైన ఆత్మతో ఐహికాముష్మిక సుఖముల సాధించనగునని చాటుచున్న దివ్యపురుషుడు. స్వామి కేశవయ్యగారు శ్రీ సాయి బాబా ప్రవచనాలను, ఆశీస్సులను యూహాతీతంగా సులభసున్నితమార్గాలలో అందిచ్చి ప్రతి యొక్కరి కర్మను బాపి సత్పురుషులుగా భగవంతుని కటాక్షమునకు పాత్రులయేలాగ చేయాలని ఆరాటపడు స్వార్థరహితుడు. అందుకనే ప్రతి గురువారం వేల సంఖ్యలో భక్తులు శ్రీ బాబా ఆశీస్సులకు, స్వామిజీ యిచ్చే విభూది ప్రసాదములకు గుమికూడి మానసికంగా, శారీరకంగా స్వస్థత చెందుతుంటారు. స్వామి కేశవయ్యగారి వేషభాషలలోని చిత్తశుద్ధి, నిరాడంబరత్వము, శ్రీ బాబా ధ్యానారాధనలు భక్తులను విశేషంగా ఆకర్షించి, ఉత్తేజపరచి సంతృప్తులను చేయుచున్నది.

స్వామి కేశవయ్యగారు శ్రీ బాబా భక్తుడు, ధ్యాని అయియుండి కూడ ధర్మవరంలో నివసిస్తుండగా ఒకప్పుడు ఆ యూళ్లో మంచి నీళ్ళకు కరువేర్పడింది. చెరువులు, బావులు పూర్తిగా ఎండిపోయినవి. ప్రజలంతా అలమటించ సాగారు. స్వామిజీ యింటి బావిలోనే నీరు ఎండిపోయినవి. అప్పుడాయన ఎవరికి తెలియకుండా చేస్తున్న ఉద్యోగ ధర్మాన్ని సయితం వదిలేసి షిర్డికి వెళ్ళి శ్రీ బాబా సమాధి ఎదుట కూర్చొని అన్నపానీయాలు మానేసి ధర్మవరంలో మంచినీళ్ళ వసతి ఎర్పడేవరకు లేచేది లేదని పది రోజులు ధ్యానసమాధిలో నిమగ్నులైనారు. పదకొండవ రోజున ధర్మవరంనుండి పుష్కలంగా వర్షము కురిసి చెరువులు, బావులు నిండినవని జాబువచ్చిన తరువాత నిరాహారదీక్షమాని శ్రీ బాబా అనుగ్రహ కటాక్షములతో విజేతగా స్వస్థానానికి తిరిగి వెళ్ళారట. పరోపకారాన్ని, ప్రజాహితాన్ని ఉద్దేశించి శ్రీ బాబా కరుణా కటాక్షములను సాధించిన సంఘటనలనేకములు గలవు.

♦ ♦ ♦

ఒకప్పుడు ఒక కంపెనీ మేనేజరు శ్రీ బాబా ఆరాధనా కైంకర్యానికని రు. 100/- విరాళమును చెక్కు రూపంగా స్వామి కేశవయ్యగారికి పంపాడట. అది చేతికందగానే ఏదో సందేహము కలిగి దానిని బాబా పాదముల చెంతనుంచి ఆదేశమును అర్థించగా స్వీకరించవలదని ఆదేశం కాగానే దానిని త్రిప్పి పంపారట. ఆ చెక్కును పంపిన మేనేజరు దాన్ని తీసికొని త్రిప్పగొట్టుటకు కారణము తెలిసికోవాలని వచ్చి అడిగేసరికి స్వామీజీ "బాబా దాన్ని తీసికోవద్దని ఆదేశించారు కాబట్టి త్రిప్పి పంపాను"

(220-వ పేజి చూడుడు)

# 10-కి 15

# 20-కి 30



ఇది నిజం. ఇందులో ఇంద్రజాలం ఏమీలేదు. మీరు నేడు నేషనల్ సేవింగ్స్ సర్టిఫికేట్లలో పది రూపాయలు దాచుకుంటే, పన్నెండు సం॥ల తరువాత, మీకు పదిహేను రూపాయలు లభిస్తాయి. మీ డబ్బు సురక్షితంగా ఉంటుంది. వడ్డీకి ప్రభుత్వ హామీ ఉంది.



## రెట్టింపు లాభం

మీరు దాచుకున్న డబ్బు పంచవర్ష ప్రణాళిక క్రింద నానా యోజనాల నిర్మాణంకొరకు ఖర్చు చేయబడుతుంది. ఈ నిర్మాణాలతో దేశమొత్తముయొక్క ప్రజాజీవిత ప్రమాణం పెరుగుతుంది. వడ్డీతోపాటు సమస్త ప్రజానీకముయొక్క పురోభివృద్ధిలో భాగంకూడా మీకు లభిస్తుంది. ఇదికాక, మీరు

# నవభారత నిర్మాణంకొరకు తోడ్పడుతారు

ఇతర వివరాలకు మరియు లేక ఈ దాస్త్రానాల గురించిన నియమావళికొరకు దయవుంచి నేషనల్ సేవింగ్స్ కమిషనర్, సిమ్లా లేక మీ రాష్ట్రముయొక్క రీజనల్ నేషనల్ సేవింగ్స్ అఫీసరుగారికి వ్రాసుకొనండి.

DA 56/151-70

# పృటుక దినం

శ్రీ సన్నాకుల సుందరరావు

"డాక్టర్ !" అంది, గాభరాగా నర్స్ కాంతం.

డాక్టర్ సుధాకర్ ఆమెవైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఆ నాల్గవవార్డులో పేషంట్‌కు సీరియస్‌గా యుంది. పిచ్చిపిచ్చి చూపులు ! కలవరింతలు ! చాలా యిదిగా వున్నయ్" అంటూ తన బాధ నంతను వ్యక్తంచేసింది. నర్స్ సూచనల వెనుక విషాదం—ఆత్రుత రెండూ స్పష్టంగా కన్పిస్తున్నయ్.

"యస్ ! వస్తున్నాపద నర్స్" అంటూ సుధాకర్ నర్స్‌ను అనుసరించి నాల్గవవార్డ చేరాడు.

డాక్టరు జాలిగా ఆ రోగివైపు చూశాడు. "డాక్టర్ !" ఆశగా అన్నాడు అతడు. అతని ఆ మాటల్లో విషాదానంద భావాలు రెండూ మిళిత మౌతున్నయ్.

సుధాకర్ అతని చేతిని నెమ్మదిగా అందుకుని నాడి పరీక్షించాడు. ఒక రెండు మూడు గంటల్లో గతించిపోయే అతని జీవితానికి ... డాక్టర్ ఎంతో సానుభూతి చూపాడు.

"డాక్టర్ ! ... నాకీ ప్రపంచంమీద ఏలాంటి ఉత్సాహము లేదు. ఈ ప్రాణంమీద తీపికూడా లేదు. కాని ఒక్కటే ఒక్క కోర్కె మాత్రం నా జీవితాధ్యాయంలో మిగిలిపోయింది. ఒక్కసారి ... నా జీవిత గాథల్ని ఎవరితోనైనా వినిపించి సానుభూతి పొందాలనుకుంటాను. కాని ... నాపై సానుభూతి చూపేదెవరు డాక్టర్ !" ఆయాసం మిళితమౌతూ అతడు మిగతా వాక్యాల్ని చెప్పలేక పోయాడు.

"భగవంతుడు కరుణగలవాడు సుమా ! చేతనైనంతవరకు నేను నీకు సహాయంచేస్తాను. భయపడకు" అంటూ అతని భుజాన్ని సానుభూతిగా తట్టాడు డాక్టర్.

డాక్టర్ యొక్క ... ఆప్యాయతలో ఆరోగి అలసటను తగ్గించుకొని దీర్ఘమైన ఒక నిట్టూర్పు విడచాడు. ట్యూబ్‌లైట్ల కాంతిలో; మానవత్వంతో ప్రకాశిస్తున్న డాక్టర్, నర్స్‌ల వంక అతడు తృప్తిగా చూశాడు. నర్స్ అతనిని జాలిగా పరికించి చూస్తూ తలకు కట్టిన కట్టును ... నెమ్మదిగా పరిశీలించింది.

"డాక్టర్ బాబూ!...ఒకనాడు నా జీవితం నిత్య కళ్యాణం పచ్చతోరణంగా గడచిపోయేది. శ్రమిక జీవితంలో వచ్చే సుఖానుభూతుల్ని తృప్తిగా అనుభవిస్తూ ధనిక జీవులకు మేము ... దాస్యము చేస్తాము. ఆ దాస్యంలో నేను వారికి ఆనందం చేకూర్చటమేగాక వారియొక్క అదరింపులలో నా జీవితాన్ని మిడింపజేసికొని కష్టాల్ని చక్కగా ఆహ్వానించటం నా నిత్య కృత్యం.

ఉదయాన్నే నేనూ, లచ్చి 'విడి – విడి' పనుల్లోకి వెళ్ళి మా విధ్యుక్త ధర్మాల్ని నిర్వర్తించుకొని వచ్చేవాళ్ళం. సాయంత్రానికి మా బడలిక అంతాతీరి ... ఆశ్రమ జీవితంలోనే ఆనందంగా కాలం వెళ్ళబుచ్చేవాళ్ళం.

డాక్టర్ ! ... అందానికి – ఆనందానికి సన్నిహితం ప్రపంచంలో నుండటం ప్రకృతి సహజం. అందమైన జీవనానికి అలవాటుపడి దాన్ని పొందలేకపోవటం మానవ సహజం. అందానికి దూరంగాయుంటూ గడిపేజీవి ఏనాడూ ప్రపంచంలో లేదు. పొందని వస్తువుకోసం ప్రాకులాడటం మానవనైజం.

మా లచ్చి చాలా రూపసి. ఆ రూపంలోనే "పవిత్రా పవిత్రతలు" మనం కనుగోవటం చాలా కష్టం. కాని లచ్చి నన్ను గాఢంగా ప్రేమిస్తుంది. నేను నా భార్యకు దాసుణ్ణి. పండంటి కాపురం ఒకనాడు కారణంలేకుండానే విషమ పరిస్థితుల్ని ఎదుర్కోవాల్సి వచ్చింది.

ఉన్నట్టుండి ఒకనాడు లచ్చి మంచానపడింది. అదే — ఆమె యొక్క అంతిమకారణంకూడా. జ్వరంతో బాధపడే భార్యకు మందులిప్పించే శక్తి నాకు లేకపోయింది. ఆమెకు అవసానదశ వచ్చింది. ఇన్నాళ్ళ కాపురంలోనూ ... నేను — లచ్చి ఆనందమయంగా సంసారపక్షంలో గడిపిన దినాలు బహు కొద్ది. ఆమె మంచానపడేసరికి నా హృదయం కొట్టుకులాడింది. నాకు సాటిగా నాతోపాటు కష్టాలను అనుభవించే ఆ ఒక్క జీవి నాకు దూరమౌతున్నట్లు నాకు తోచింది. నా భార్య నాకు కావాలి. ఈ శ్రమ జీవితంనుంచి నేను ఆనందాన్ని పోగొట్టుకో కూడదు అని తలచాను.

నా లచ్చిని బ్రతికించుకోవాలని నేను ఎన్నో ప్రయత్నాలుచేశాను. ఎంతో మందిని డబ్బుకోసం యాచించాను. కాని ఏమహాత్ముడి హృదయమూ ద్రవించలేదు.

ఆకాశం అంతా కారు మేఘాలతో నిండింది. ఒక వైపు వర్షం జోరుగా కురుస్తూయుంది. మరి యొకవైపు లచ్చి అవసానదశలో కారుస్తూయున్న కన్నీరు ఆ గాఢాంధకారంలో మిలమిలా మెరిసినయ్.

"మామా ?" అంది బాధగా లచ్చి.

"రేపు ... నీ పుటకదినంకదూ ! ... నీవా రెండంచుల పంచ కట్టుకొని ఎఱ్ఱని కండువా వేసికుంటే ఎంత బాగుంటావు" అంటూ విచారంగా ఆమె నా వైపు చూసింది.

"ఔను లచ్చీ ! ... ఆ పుటకదినానికి అంతే లేదు. మనబోటోళ్ళు పుట్టినా నవ్వే జీవిలేదు. ఆఘోగతిపాలై మరణించినా ఒక కన్నీటి చుక్క విడిచేవారులేరు" అన్నాను మౌనంగా దుఃఖాన్ని దిగమ్రింగుకుంటూ.

"దుఃఖించకుమామా ? అందంగావుండే ఏవస్తువునూ ప్రకృతి జీవించనీయదు; హరింపజేయటమే ప్రకృతి సహజం. మానవుడికి అందచందాలు ప్రధానంకావు మామా ? ... నా వంటి అంబాల రాణి దొరకదనే నీవుద్దేశ్యమూ ? ఒక్కసారి ఆ రెండంచుల పంచెకట్టుకుని నన్నానందింప జేయవా మామా ?" అంటూ, ఆమె, ఆశగా నావైపు చూసింది.

డాక్టర్ ! ... అది మా పెళ్ళినాటి పంచ. దుఃఖంలోకూడా దాన్నిధరించి నాలచ్చి సమక్షంలో దుఃఖమోముతో నిలిచాను. అంతే డాక్టర్ ! ఆ ఒక్క చూపునూ నా హృదయంలో నిలిపి నాలచ్చి గతించింది.

ఆ నిశిరాత్రిలో నా పుటకదినానికి లచ్చిచావే సాక్ష్యమైంది-అదే దినం నా ఆనందానికీ విషాదానికీ నెలవైంది. నాలచ్చి ఆశ్మశానవాటికలో, చితిపై వెలుగుతూయున్న ఆమె దేహం, నాకేదో ప్రభోధాన్ని యిచ్చింది. "మామా ! ఆ పంచెధరించవూ ? నీ పుటక దినంకదూ ?" అనేమాటలు నాకు ప్రస్ఫుటంగా వినిపించినయ్.

లచ్చి లేని జీవితం నాకు అంధకారమయమయి పోయింది. మరునాడు యధాప్రకారం నాపనిలోకి పోయాను. ఒకదినం పనికి రాక పోయినందుకు మాయజమాని నిర్దాక్షిణ్యంగా నన్ను పనిలోంచి తొలగించారు. వారికి నా భార్య చావుతో పని ఏమిటి ? ... బీదల అభాగ్యగాధలతో పనియేమిటి ? ... వారిక్కావలసిందల్లా సుఖభోగాలు.

డాక్టర్ ! ... ఇదిగో ఈ వీధిలోనే నేను పుల్లలు మోస్తూ జీవిస్తూయున్నాను. ఆమోతలోనే నాలచ్చి యొక్క ఆఖరి మాటలు నాలో ప్రతిధ్వనింపసాగాయి. "పుటుకదినం డాక్టర్ ! పుటకదినం !!" ఒక అభాగ్యగతుడి పుటక దినానికి విలువేముంది. ఒక మహానాయకుడు పుట్టినా, చనిపోయినా అందరూ ఆనందిస్తారు. శుభాశీస్సులనందిస్తారు. వేనోళ్ళ పండుగలుచేస్తారు. ప్రేగులు మాడుతూ ఆకలి బాధతో అలమటించి పోయే మాలాంటి వానికి విలువఏముంది!

డాక్టర్ ! ...సంవత్సరం దొరలిపోయింది. మరలా నా "పుటకదినం" వచ్చింది.

నాలచ్చియొక్క ఆత్మశాంతికై నేను ఆ రెండంచుల పంచెను ధరించాలి కాని, ఆపంచె ఎక్కడుంది డాక్టర్! నాకు సేవజేసినంతవరకూ చేసి, చిరిగిపోయింది. దాంట్లో నూతనానందం లేనేలేదు. కనపడిన ప్రతివారినీ యాచించాను. ఒక్కపంచె ఒక్కటే ఒక్కపంచె కోసం కాని ఏ హృదయమూ నాపైకరుణ చూపలేకపోయింది.

నాకప్పట్లో కన్పించిందల్లా! ఒక్కటే మార్గం. అది ... ఆ బట్టల కొట్టులో జొరబడి ఎఱ్ఱనికండువా రెండంచుల పంచె దొంగలించాలని. మధ్యరాత్రి-తెల్లవారితే "నాపుటకదినం" నేను ఆదినం ... లచ్చియొక్క ఆత్మశాంతి కలిగించాలి. అది నా ధర్మం. చెక్కలు తొలగించి పంచె కండువాలతో తిరిగివచ్చేసమయం డాక్టర్! దానికిప్రతిఫలం, ఘూర్ఖా నన్ను వెనుకనుంచి బలంగా తన లాటితో మోదటమే. నాకే నెత్తురుతో అలాగే పరిగెత్తుతూ సందులు — గొందులు దాటి ఈ ఆస్పత్రిముందర పడిపోయాను. మీరునన్ను లోనికి తెప్పించారు.

"డాక్టర్! రేపే నాపుటకదినం...ఆపంచె ఎఱ్ఱని కండువా నాకు బాగున్నయ్ కదూ?"

"డాక్టర్! ఒక్కటే ఒక్కకోరిక. ఆకోరికను తీర్చగలరూ ఆ ఒక్క కోర్కతో, ఈ వెంకడి జీవితం ధన్యత చెందుతుంది" అంటూ డాక్టర్ వైపు చూశాడు.

డాక్టర్ బాధగా అతనివైపుచూచాడు.

"ఒక్కసారి మీటోపీని ఈ తలమీద పెట్టు డాక్టర్! ... నేను అందంగావుంటానా? ...లచ్చి నన్ను మెచ్చుకుంటుందా?" ప్రశ్నించాడు వెంకడు.

డాక్టర్ తన హేట్ తీసి అతనితలమీద పెట్టాడు.

"నర్స్!..." మిగతా మాటల్ని అనలేక తృప్తిగా చూచాడు వెంకడు"

"ఔను! నీ పుటకదినం! ఎంతబాగున్నావ్?" అంది నర్స్ శాంతం. "ఔను! ... అదిగో నాలచ్చి కూడా నవ్వుతూయుంది. "నాపుటకదినంకదూ?" వస్తున్నా లచ్చీ!" అంటూ కళ్లుమూశాడు వెంకడు.

"డాక్టర్" అంది నర్స్ భయంగా కళ్లుమూసికుంటూ "భయపడకు నర్స్! ఈ వెంకడి ఆత్మ హాయిగా విహరించకమానదు. ధనవంతులకు వేలమీద సంతోషోత్సాహాల్లాలతో జన్మదినం జరిగినా ఈ ఒక్క పంచె — కండువాతో, ఆనందించిన, ఆనందం మనం, పొందలేం" అన్నాడు డాక్టర్ నర్స్‌వైపు చూస్తూ.

కిటికీగుండా వచ్చిన మెఱపు కాంతి, వెంకడి మొహాంమీదపడింది. ఆ వెలుతురులో అతనిముఖం, కళగా మెరిసింది. అదే కాబోలు గొప్పవిశేషం. వెంకడి పుటకదినానికి మెఱపు మెరిసింది. అదే! అభాగ్యులకు ప్రకృతి కానుక కూడా. అతనికి చనిపోయినా పుట్టినా మనలా రిస్టువాచీలూ — ఉలెన్‌సూట్‌లూ లభించక పోయినా... అంతంలేని ఆనందం లభిస్తుంది "పుట్టినరోజు" వచ్చినపుడు. ఆయుర్ధాయంసాగాలని ప్రతివారూ వాంఛిస్తారుగాని ... ఆ పుటకదినం ఏనాడో ఒకనాడు అంతరించక మానదు. బీదవాడు 'పుటకదినం' వచ్చేసరికి తన కష్టాలనుంచి ఏనాడు విముక్తి చెందుతానా అనే ఆలోచిస్తాడు. అదే గొప్పవాడైతే 'ఆయుర్ధాయం అధికమై నాలుగురాళ్లు సంపాదించాలనే' ఆలోచిస్తాడు. ఇదే బీదవాడి పుటుకదినానికీ - గొప్పవాడి పుటుకదినానికీ గల తారతమ్యం.

—o—

# గాలిలో

శ్రీమతి ఎం. లక్ష్మీదేవి

గాలిలో ఎంత దూరము
కదలి పోయెదవే సఖి ! ఎగిరి పోయెదవే॥

జగతిలోని మూఢ తనమును
మూగవోయిన ధర్మరక్షణను
దాపురించిన దరిద్రతను విదిల్చి
ఉన్నత మార్గాని కెంతదూరము.
కదలి పోయెదవే సఖి ! ఎగిరి పోయెదవే॥

నిన్నంటియున్న సూక్ష్మతంతువు
చంటి పిల్లవాని చేతియందున్నను
వింత యేమన్న నీ లోకసంబంధము
రవంతయైన వదలకయే ... (గాలిలో)

పెద్దపెద్ద కొండలెన్నియో
అడ్డు వచ్చినా లెక్కచేయక
కష్టముల నెల్ల నెదుర్కొను
శుద్ధుడగు యాంధ్ర వీరుని వలె....
(గాలిలో)

వాయు మండలములో వలసినవస్తువేది?
మేఘ మండలములో మెరయువస్తువేది?
తారలప్రభలో తళుకులాడుట యేమి?
చంద్రుని వెలుగులో పొందుట యేమి?
......(గాలిలో)

సూర్యునిపై చూచుట యేమి ?
కార్యమదేమి ? కావలసినదేది ?
దీక్షను వీడక తిరుగునదేమి ?
ఉపేక్ష వహించి జగతిపై ....(గాలిలో)

నమ్మకమున్నదా పొందగలనని
సమ్మతమున్నచో పోవే
కమ్మని తేనెను గ్రోలు తుమ్మెద
సన్మతిన్ గోరు జ్ఞానిని బోలె...
(గాలిలో)

బాలుర ఉన్నతికి నీవే ఆదర్శం
గాలిపటమన్న వారికి జీవం
పాఠము నేర్పుదు మానవజాతికి
భవసాగరము దాటు విధానమేదని
... (గాలిలో)

# నారీ ఆత్మకథ

లేఖిక:
శ్రీమతి అనిలాదేవి

అనుసరణ:
శ్రీ తుర్లపాటి శంభుదయాల్

నేను నారిని. నా స్వామికి నేను సహధర్మిణిని. పుత్రునిమాతను. ఈ ప్రపంచమునందు నావంటి శ్రేష్ఠులింకెవరున్నారు? ఈ జగత్తంతయు నాకర్మక్షేత్రం. నేను స్వతంత్రను, నా అభిలాషానుసారంగా వ్యవహరించగలనుగాబట్టి. ఈ జగత్తున నేనెవరికీ భయపడను. నేను శక్తి స్వరూపిణిని. మనుష్యుడు నాశక్తిని పొందే శక్తి సంపన్నుడగుచున్నాడు.

నేను స్వతంత్రనే; కాని స్వేచ్ఛాచారిణిని కాదు. నేను శక్తి యొక్క ఉద్గమ స్థానాన్ని, కాని అత్యాచారంతో నా శక్తిని ప్రకాశింపజేయను. నేను చెప్పడమే కాదు, చేస్తానుకూడా. నేనుపని చేయనిచో ప్రపంచంసాగదు. సర్వంచేస్తూకూడ, నేను అహంకారపడను. కార్యశూరులమని యభిమానపడేవారి హస్తాలు అణగిపోతాయి.

నా కర్మక్షేత్రం చాల విస్తృతమైనది—బాహ్యంగా కాదు, ఆంతరంగికంగా. అచ్చట నాతో సమానంగా పరిజ్ఞానం కల్గినవారుండరు. నేనెటు చూచినా అప్రతిహత కర్తృత్వాన్ని పొందుతాను. నా కర్తృత్వంలో నన్ను ఆటంక పర్చేవారెవ్వరూవుండరు. అసలు నేనటువంటి యవకాశ మెవ్వరికీ ఇవ్వను. పురుషుడు నామాట వినడానికి బాధ్యుడు - నా కర్మక్షేత్రంలో నా సందేశంవలన ప్రపంచమున్నతమౌతుంది - కాబట్టి స్వామి సందేహానికి కారణంలేదు. ఇకపుత్రుని విషయం - అతడు నా వాడే, కాబట్టి నామాట వినడానికి బాధ్యుడనే విషయం సహజం. వీరిద్దరిని - పతిని - పుత్రుని - వశపర్చుకొని జగత్తునందు అజేయగానున్నాను. భయమంటే ఏమిటో నేనెరుగను. నేను పాపాన్ని ద్వేషిస్తాను - కాబట్టి భయం నన్ను ముట్టదు. నేను భయపడను, కాబట్టే నన్నెవరూ భయపెట్టడానికి ప్రయత్నించరు.

ప్రపంచంలో నాకంటె గొప్పవారెవరున్నారు? వారిని నేను చూడను. నాకంటె చిన్నవారెవరున్నారో! వారిని గూడ గాంచలేను. "నేను ఈ ప్రపంచంలో ప్రధానుడనని, నాకంటె గొప్పవారెవ్వరూ లేరని" పురుషుడు గర్విస్తాడు. కాని నేనెవ్వరినీ లెక్కచేయను. అతడు దంభంతోను, దర్పంతోను దేశాన్ని కంపింపజేయాలనుకుంటాడు. అతడొకప్పుడు ఆకాశంలో ఎగురుతాడు, సముద్రాంతర్భాగాల్లో సంచరిస్తాడు. మరొకప్పుడు రణభేరిని మ్రోగిస్తూ, ఆకాశవాయువును కంపింపజేసి దూరాతిదూరంగా దౌడు తీస్తాడు. కాని నా ముందుమాత్రం అతడు సదా చిన్నవాడే. నేనతని తల్లినిగావున, అతని రుద్రరూపాన్ని గాంచి కోట్లకొలది మానవులు భయకంపితులౌతారు. కాని అతడు నా వ్రేలికదలిక మాత్రంతో మౌనం వహించడానికి వివశుడౌతున్నాడు. నేనతని తల్లిగా - కేవలం నిస్సహాయమైన బాల్యంలోనే కాదు - సర్వదా, సర్వత్రవున్నాను. ఏ తల్లిస్తనములపాలు త్రాగి అతడు దేహపుష్టిని పొందాడో ఆమాతృత్వపు కంటిసైగతో ఆమె యాజ్ఞ శిరసావహించడానికి బద్ధుడగుచున్నాడు.

పురుషుడు గర్వాంధుడై, సింహము, పులి మొదలగు జంతువులవలె క్రూరంగా ప్రవర్తిస్తుంటాడు. కర్కశత్వంతో కలిసి యాతని కోమల ప్రవృత్తులు శుష్కించి పోతుంటాయి. రాక్షస ప్రవృత్తి నాధారంగా జేసికొని ప్రపంచమును భస్మంచేయడానికి పూనుకుంటున్న భయంకర పరిస్థితులలో, అతని శుష్కమరుభూమిలో, సుశీతల అమృతవర్షాన్నెవరు కురిపిస్తారు? నేనే—అతని సహధర్మిణినే. అతనిని నావద్ద కూర్చునబెట్టుకొని నా నిసైజాన్ని అతనియందు మేళవింపజేసి కోమలంగా మార్చివేస్తాను. నా శక్తి,

సామర్థ్యముల ప్రతిహతములైనవి. ప్రయోగించే కళ నేర్చిన యువిరెన్నటికీ వ్యర్థముకాజాలవు.

నేను బాహ్యజగత్తునందు కర్తృత్వం కోరడంలేదు. అది నా తండ్రి, పుత్రుల, తమ్ముల కర్మక్షేత్రం. నా కర్మభూమి వారికంటే ఎంతయో విస్తృతమైనది. పురుషుడసాధ్యమని తలచిన పనిని అతి సునాయాసంగా చేసివేస్తాను. ప్రమాణం - పురుషుని అభావంలో ప్రపంచం నడువగలదు - కాని నా అభావంవలన అది అచలమైపోతుంది. సర్వమున్నప్పటికీ సార్థకముండదు.

నేను చదువుతున్నాను - సంతానాన్ని సుశిక్షితం చేయడానికి, శ్రమించిన భర్తకు శాంతిని చేకూర్చడానికి. నేను సంగీతకళ నభ్యసిస్తున్నాను — పురుషుని విలాసలోలసత్వాన్ని సంపూర్ణం చేయడానికి కాదు. పురుషుని హృదయాన్ని కోమలంచేసి పూర్ణత్వం ప్రసాదింపజేయటానికి. స్వయంగా నాట్యంచేస్తూ నాతోపాటు జగత్తునుకూడ నాట్యమాడిస్తాను. నేను నేర్చుకొంటాను - నేర్పడానికి. విద్యాక్షేత్రంలో నాకు జన్మగతాధికారమున్నది. నాకు నిరర్థకులందృవించరు. నేను ప్రకటిస్తాను ఆదర్శాన్ని - సృష్టిస్తాను మానవుణ్ణి, మహామానవుణ్ణి.

నేను ఖడ్గం ధరించినకాళిని - పాపులను వధించేందుకు. దశప్రహరణములు ధరించినదుర్గను - సమరభూమిలో నారీశక్తిని జాగృతం చేయడానికి. నేను లక్ష్మిని - ప్రపంచాన్ని శుశోభితం చేయడానికి. నేను సరస్వతిని - విశ్వంలో విద్యను వితరణజేయటానికి. నేను ధారణిని - సహిష్ణుతాగుణంవలన. నేను ఆకాశాన్ని - అందరికి ఆశ్రయదాయినినిగావున. నేను వాయువుని - అందరికీ జీవనదానం చేస్తానుకాబట్టి. అందరిని శుభ్రపర్చేజలాన్ని - ఇతరులను తనవారుగా జేసికొనుటలో. నేను మట్టిని - మాతనుగాబట్టి. నేను జ్యోతిర్మయిని.

నాధర్మంలో ఏ విధములైన మతాంతరములు లేవు- నాధర్మంనారీత్వం - మాతృత్వం జాతిభేదజనితమైన చిహ్నము లేవీలేవు. సంపూర్ణ నారీజాతి నాజాతి.

పురుషుడు కాముకుడు, కాబట్టి నేనూ అతని వలె నేయని భావించి నన్ను "కామిని" యనడానికి ప్రయత్నిస్తాడు. పురుషుడు దుర్బలుడు. తనకు తనే సహజంగా విభాజింపబడిపోతాడు. ఇందువల్లనే నన్ను "భార్య" అంటాడు. నేను సర్వం సహిస్తాను - సహించడం తెలుసు కావున.

నేను మానవుణ్ణి చేతుల్లో ఆడించి మానవునిగా తయారుచేస్తాను. అతని శరీరపు దుమ్ముతో నా శరీరాన్ని మురికిచేసికొంటాను — ఇవన్నీ సహించగలను గాబట్టే.

రామాయణము, మహాభారతము - ఈ రెండు గ్రంథాలే నాకు యథేష్టమైన జ్ఞానాన్ని ప్రసరింపజేస్తాయి. నేను మరొకభాష నభ్యసిస్తాను - కాని మాట్లాడుతాను నా భాష. కాబట్టే నాసంతానం దాన్ని గౌరవభావంతో మాతృభాష అంటుంది. నన్నుగుర్తించారా ? గుర్తించకపోతే ప్రపంచాన్నేమి గుర్తిస్తారు?

(మూలం: హిందీ కళ్యాణ్ నుండి)

# ఉగాది కానుక

## శ్రీ హేవిళంబి!

కవి భూషణ, శ్రీ కల్లూరు అహోబలరావు

లావణ్య కిసలయ రాశితోఁ దరులతా గుల్మముల్దోరణ కల్మిఁగూర్చె
క్రొమ్మావి దళములఁగూర్చి, ప్రకృతి దేవి సింహాసనము నీకు సిద్ధపఱచె
మొల్ల కాంచనములు, మల్లియల్మరువముల్ మధురహారముల, సన్మాన మిచ్చె
శుక పిక శారికా నికరంబు, మృదు మధు ఋతముల నీకు స్వాగత మొసంగె
కంతు సామంతుఁడైన, వసంతరాజు నింబ కుసుమ పానకము దాహంబొసంగ
డంబుగా వేచియుండు; విలంబమేల? అంబికా! హేవిళంబి। వైళంబరమ్ము.

బూఁజు బూగరదుల్పి, మోజుగా నిల్లిల్లు వెల్లవేసిరి ప్రజలెల్లవారు
తెల్లవారకనె, వేనీళ్లఁ దలంటు తానంబు సలిపిరి జనంబులెల్ల
క్రొత్తవస్త్రంబులఁ గోమరొప్పఁ దాల్చి రా బాలగోపాలంబు లీలతోడ
పిండి వంటలతోడఁ బండుగ బోనంబు వండిపెట్టిన వారు దండిగాగ
హేవిళంబి! రమ్ము, హావభావములుల్లసిల్ల, విందు సేయు ముల్లమలర
కూడి, యాడి పాడి వేడుకతోడ - నుగాదిఁ గడప వలయు గారవమున.

భద్రతాసంఘ, మభద్రంబు కాఁజొచ్చె, ధర్మసూత్రంబుల దారితప్పె
'కాశ్మీరు' 'గోవాలు' గండకత్తెరలాయె, కుట్రతతంగముల్ కొలఁదిమీఱె
అమెరికా, బ్రిటిషు వారడ్డుసేయుట లాయె, 'జారింగు' ఢిల్లీకి జారుటాయె
కీచులాడంగఁ బాకీస్థాన్ దయారాయె దుష్ప్రచారంబులు దోరమాయె
శాంతి సఖ్యతా భావముల్ సమసిపోయె, భారత-స్వతంత్ర రాజ్య ప్రభావగరిమ,
గాంచి పశ్చిమ రాజుల కనులు కుట్టె త్రోవ సరిజేయ గదవమ్మ! హేవిళంబి!

నెహ్రూజీ ధీరుండు నిత్యయౌవన బలోత్సాహంబుతోఁ బ్రపంచమును దిరిగి
'పంచశీల'ంబను, పంచాక్షరీమంత్ర ముపదేశ మొనరించి యూర్జితముగ
అణ్వస్త్ర ముపయోగ మరికట్టి - మానవ సభ్యత లెఱిగించి, శాంతి - సత్య
న్యాయసూత్రముల భావ్యంబు, పరస్పర సహకార సౌభ్రాతృ సరణిఁ దెల్పి
రాజ్యముల, సత్పథంబున రమణఁ ద్రిప్ప కష్టపడుచున్నవాడు; విఖ్యాతముగను
భరత మాతృ బిడ్డడు, జవహరుఁడు ఘనుఁడు; ప్రోవుమాతని దీవించి హేవిళంబి!

పదుమూడు రాష్ట్రముల్ భాసిల్లె నందులో పదిరెండు, కాంగ్రెస్సు పాలనమున
వర్ధిల్లె ; కేరళ పాలనంబొకటి, కమ్యూనిష్టులకు జిక్కె ; హాని లేదు
కేంద్రపాలనములో - సాంద్రతరంబైన కాంగ్రెస్సు బలగంబుగలదు ; హైక
మాండుకు లోబడియుండి - ప్రజాక్షేమ కార్యముల్ సలుప సౌఖ్యంబుగలుగు
సర్వప్రాజెక్టు కార్యముల్ సఫలమగుచు, భరతభూమి, శ్రీమంతమై పరగవలయు
ఖండ ఖండాంతరముల విఖ్యాతి నార్జనంబు సేయవలయు ; హేవిళంబి ! నీవు.

చంద్రుండు రాజయు - చల్లగా రాజ్యంబు పరిపాలనముసేయు భవ్యముగను
సేనాధిపతిగ వెంచేసిన శుక్రుండు, శత్రుల నిర్జించు సాహసమున
గురుచార ఫలములు గురుశుభంబు లొసంగి ఆయురారోగ్య భాగ్యముల నిచ్చు
పశునాయకుండు, గోపాలమహారాజు, పాడిపంటలకు లోపములు రావు
మంత్రి శనియైన మాత్రాన, మంతనములు సాగజాలవు; చోరాగ్ని రోగబాధ
లంపటు లడంగు ; శ్రీ హేవిళంబి రాజ్యభారమును సల్పుచుండెడి వత్సరమున.

॥ ఓం ! శాంతి శ్శాంతిః ॥

# తి రు గు బా టు

'మాల్యాద్రి'

[అర్ధరాత్రి - మోహనబాబు గృహం - యలమంద కూర్చుని కునికి పాట్లుపడుతున్నాడు. ఇంతలో గడియారం ఘంటలుకొట్టటం ప్రారంభించింది. యలమంద నిద్రమత్తుతో గడియారానికేసిచూస్తూ ఘంటలు లెక్ఖపెట్టుకుంటూవున్నాడు.

ఇంతలో ఒక వ్యక్తి దొంగలాగా మెల్లగా ప్రవేశించాడు. చిరిగిపోయిన దుస్తులూ, మాసిపోయిన గడ్డంతోటి బికారిలాగా కనుపిస్తున్నాడావ్యక్తి. అతని తలమీద ఒక Evening hat వుంది. కన్నులకు మాత్రం నల్లని ముసుగు ధరించాడు. చేతిలో ఒక పెద్ద బాకుంది. ఇతన్ని ఫలానా అని నిర్ణయించలేం.

యలమంద గడియారానికేసిచూస్తూ ఘంటలు లెక్ఖపెట్టుకుంటూ వున్నాడు. అతడు యీ ముసుగు మనిషిని చూడలేదు. గడియారం పన్నెండు ఘంటలు కొట్టింది. ముసుగు మనిషి మెల్లగావెళ్లి యలమంద పీకను పట్టుకున్నాడు. యలమంద తిరిగిచూశాడు. భయపడిపోయాడు. బిగ్గరగా అరుద్దామనుకున్నాడు.]

ముసుగుమనిషి:_ఇస్సు, అరవకు, గలాటాచేశావా...

(ముసుగు మనిషి బాకును చూపించాడు. యలమంద భయపడిపోయాడు. అట్టే అతనికేసిచూస్తూ నిలబడిపోయాడు.)

ముసుగు:_మోహన్‌బాబెక్కడ ?

యలమంద:_మాచినబాబుగారా ?

ముసుగు:_అవును.

యలమంద:_దేనికి బాబూ ?

ముసుగు:_అదంతా నీ కక్కర్లేదు. అడిగిన ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పు. మోహన్‌బాబెక్కడ ?

యల:_నాకు తెలవదు బాబూ.

ముసుగు:_అబద్ధం - నీకు తెలుసు. చెప్తావా లేక పొడిచిపారెయ్యమంటావా ?

(బాకును యలమంద గుండెలమీద వుంచాడు.)

యల:_మాచిన బాబుగారు యింకా యింటికిరాలేదు బాబూ.

ముసుగు:_ఎక్కడ వున్నట్లు ?

యల:_ఏమో ! నాకు తెలవదు బాబూ.

ముసుగు:_నిజంచెప్పు.

యల:_నిజంగా బాబూ ! నాకు తెలవదు.

ముసుగు:_మోహన్‌బాబు పడకగది ఎక్కడ ?

యల:_మేడమీద బాబూ.

ముసుగు:—మేడమీద గదిలోకూడా చూచివచ్చాను అక్కడకూడాలేదు. వూరంతా గాలించాను. ఎక్కడా అమాకీ దొరకటంలేదు. ఎక్కడ వున్నట్లు మోహనబాబు ?

యల:—దాసీవాళ్లం . మాకేంతెలుసు బాబు!

ముసుగు:—అంతా మోసంగావుంది. ఎక్కడా లేకుంటే ఎక్కడ వున్నట్లు ?

యల:—(కొద్దిగా ధైర్యం తెచ్చుకుని) ఇంతకూ తమరు ఎవరు బాబూ ?

ముసుగు:-ఆకలిగొన్న సింహాన్ని, మోహనబాబు రక్తం త్రాగితేనేగాని నా ఆకలిమంట చల్లారదు. తప్పించుకున్నాడు మోహన్ బాబు. చేతికి దొరికి వుంటే చీల్చి చెండాడేవాణ్ణి. రక్తం త్రాగేసే వాణ్ణి. చూస్తాను. నా బాకు పోటునుంచి ఏలా తప్పించుకుంటాడో చూస్తాను.

(క్రూరంగా నవ్వుతూ వెళ్ళిపోయాడు.)

యల:—(ధైర్యం తెచ్చుకున్నాడు) పెంకినాయాలు నన్ను బెదరిస్తాడుగా ! చూపిస్తాను యీడికి నా తడాఖా. మెదకాయంతా నులిమిపారేశాడు. యదవనాయాలు. యీడ్ని చిత్తుచేసి పారేస్తాను. యింతకూ యీ డెవడైనట్లు ?

(యలమంద వెళ్లిపోయాడు)

(కొంత సేపటికి సరళ ప్రవేశించింది)

(సరళ పడకమీద కూర్చుంది. చదువుకుందామని ఒక పుస్తకం తీసింది. కాని మనస్సుపోలేదు. లేచి గుమ్మం దగ్గరకు వెళ్లి వీధిలోనికి తొంగిచూసింది. నిరాశతో తిరిగివచ్చింది. మళ్లీ చదువుకుంటూ కూర్చుంది)

(కొంత సేపటికి ఎవరో తలుపుతట్టారు. సరళలేచి గుమ్మం దగ్గరకు వెళ్లింది.)

సరళ:—ఎవరు ?

తెరలో:—నేనమ్మా !

(సరళ తలుపుతీసింది. తాతయ్య ప్రవేశించాడు.)

సర:—కనుపించారా తాతా ?

తాతయ్య:—కనుపించాడమ్మా.

సర:ఎక్కడవున్నట్లు ?

తాత:—ఇంద్రభవనంలేదూ, ఆ హోటలు మేడమీద ... ఒక గదిలో ...

సర:—ఏంచేస్తున్నారు తాతా ?

తాత:—ఏమని చెప్పేది !

సర:—ఏం ?

తాత:—నోటికొచ్చినట్లు తిట్టిపారేశాడు.

సర:—ఎవర్ని ?

తాత:—నన్నేనమ్మా.

సర:—ఎందువల్ల ?

తాత:—అక్కడికి వెళ్లానని.

సర:—నిన్నెప్పుడూ పల్లెత్తుమాటకూడా అనేవారు కారు. నిన్నే తిట్టేశారా ? తాతా ! మరి అక్కడ ఏంచేస్తున్నట్లు ?

(తాతయ్య సంధిగ్ధావస్థలో పడిపోయాడు అతని కన్నులలో కన్నీరు తిరిగాయి.)

తాత:—చిన్నప్పటినుంచి చినబాబును యీ చేతులతోటి పెంచి పెద్దవాణ్ణిచేశాను. కాని యీ

చేతులు మంచి చేతులు కావమ్మా. పాపిష్టి చేతులు.

సర:—తాతా ?

తాత:—పెదబాబుగారు, పెద్దమ్మగారూ సుఖంగా దాటుకపోయారు. నేను ఒక్కడినే మిగిలి పోయాను.

సర:—ఏమిటి తాతా ? ఏంజరిగింది ?

తాత:—ఇంతకూ నీలో ఏదో ఒక పెద్దలోపంవుంది తల్లీ.

సర:—నాలోనా ?

తాత:—అవును. లేకుంటే చినబాబు యీలా చెయ్యడమ్మా.

సర:—ఏంచేశారు తాతా ?

తాత:—ఆ మేడమీద గదిలో... ఆ చిన్నదాని వలలో పడి తందనాలాడుతున్నాడు చినబాబు.

సర:—ఆ ! ఎవరా చిన్నది ?

తాత:—ఆ నాడు నాట్యం చేసిందే - ఆ చిన్నది.

సర:—తిలోత్తమ.

తాత:—ఆ. అదే. సిగ్గూఎగ్గూలేని ఆడది. ఎందరినో మోసంచేసిందిట. మన చినబాబు ఆ మాయలాడి వలలో పడిపోయాడమ్మా.

సర:—నిజమా తాతా ?

తాత:—నెలరోజుల్నించి జరుగుతూవుందిట యీ యవారం. వినటమె కాని చూశింది లేదు. యీ నాడు కళ్లారా మాశాను. ఆరంపదాని సమక్షంలో నన్ను నానామాటలు అనేశాడమ్మా.

సర:—తాతా ! నా సంసారం కూలిపోయింది.

తాత:—చినబాబు చెడిపోయాడు. పండువంటి కాపురంలో చిచ్చు పెట్టాడు. ఇంతకూ నీలో ఏదో లోపంవుందమ్మా. ఆలోపాన్ని సరిదిద్దుకుని చినబాబును అదుపులోవుంచుకోవాలి.

సర:—నేనేం పాపం చేశాను తాతా ?

తాత:—ఏమోతల్లీ ! నాకేంతెలుసు ? నీలో ఏమీ లోపం లేకుంటే చినబాబు యీలా ఎందుకు మారిపోయాడు? ఆలోచించుకోతల్లీ ! ఆలోచించుకో. నీలో ఏమీలోపం లేకుంటే ఆ తప్పంతా చినబాబుదే.

సర:—నాకేమీ అర్థంకావటంలేదు తాతా! నాకుమతి పోయినట్లుంది. ఆయన యింతగా మారిపోతాడని ఎన్నడూ అనుకోలేదు.

(సరళ ఆలోచనలోపడ్డది. ఆలోచిస్తూనే వెళ్లిపోయింది.)

(కొంతసేపటికి యలమంద ప్రవేశించాడు)

యల:—మామా !

తాత:—ఏంరా ! యలమందా ?

యల:—చినబాబు ఎక్కడుండాడో చెప్పవయ్యా.

తాత:—ఏమొచ్చిందిరా ?

యల:—కొంపమునిగిందయ్యా బాబూ ! కొంపమునిగింది.

తాత:—ఏమైందిరా ?

యల:—ఎవడో సోడానాయాలు.

తాత:—ఆ !

యల:—ఏకంగా కత్తితీసుకొనేవచ్చాడు. చినబాబును చంపెయ్యటానికి.

తాత:—ఆ ! ఎవరురా వాడు ?

యల:—ఎవడో ! ముఖానికి ముసుకు వేసుకొన్నాడు. గుర్తుపట్టలేకపోయాను ?

తాత:—ఏమన్నాడు ?

యల:—"ఆకలిగొన్న సింహాన్ని. మోహన్ బాబు రక్తం త్రాగి నా ఆకలి మంట తీర్చుకోవాలి" అన్నాడు మామా.

తాత:_ఆ ! అంతదూరమొచ్చింది !

యల:_వూరంతా గాలించాడంట, ఆఖరికి మేడమీద పడకగదిలోకూడా చూశాడంట చినబాబుకోసం. "చినబాబు ఎక్కడుండాడో చెప్పు" అని నన్ను తెన్నసతాయించినాడు మామా.

తాత:_ఏంచెప్పావ్ ?

యల:_నాకు తెలివదంటే తెలివదన్నాను.

తాత:_చెప్పలేదుగదా ?

యల:_ఏమని చెప్పేది !

(తాతయ్య ఆలోచనలో పడిపోయాడు)

యల:_మామా ! ఇంతకూ చినబాబు ఎక్కడున్నట్లు?

తాత:_చినబాబుకు చెడు బుద్ధి పుట్టిందిరా.

యల:_ఏంచేశాడు మామా ?

తాత:_చినబాబు ఒకరంకుదానివల లోపడిపోయాడు. ఇంటిని యిల్లాలినికూడా మరచిపోయాడురా చినబాబు.

యల:_ఆ ! ఎల్లెట్లా ! ఇదాకథ. ఎవరా చిన్నది ?

తాత:_తిలోత్తమ-నాటకాలూ, నాట్యాలూ ఆడుతూ వుంటుందే-ఆ చిన్నది.

యల:నారాయణ. ఆ తిలోత్తమ తలకాయలుమార్చే పచ్చి ఖిలాడి మామా! దానివలలోనే పడిపోయాడూ! అందుకనే చినబాబు నెలరోజాల్నుంచి అదో రకంగా మారిపోయాడు.

తాత:_అవును. నెలరోజుల్నుంచి జరుగుతున్నదే యీ యవారం. నమ్మలేకపోయాను. కాని యీ నాడు నా కళ్ళార చూశానురా యలమందా.

యల:_అయితే ఆ పెంకెనాయాలు ఎవడైవుంటాడు?

తాత:_దానికేంరా. బెల్లంవుంటే యీగలు ముసురుకుంటాయి. ఆ యీగల్లో అదీ ఒక యీగేమో!

యల:_ఉండొచ్చు. మామా ! వాడికంటపడ్డాడంటే చినబాబు నేటితో సరి. యీ విషయం అమ్మగారికి తెలిసిందా ?

తాత:_పాపం. ఆ ఎర్రి తల్లికి తెలవనే తెలవదు. యిప్పుడు నేను చెప్పాను.

యల:-ఈ విషయం మాత్రం ఆమెతో చెప్పొద్దు మామా.

తాత:_చెప్పకుంటే ఎట్లా ?

యల:_అసలు విషయం తెలిసిందిగా. చాలు. యిప్పుడు చినబాబును యీ ఆపదలోనుంచి రక్షించి యిల్లుచేర్చే భారం మనమీదవుంది. పద మామా పద. చినబాబునుతెచ్చి యీ యింట్లో పదిత్తే తరువాత ఆమె యిష్టం, ఆయన యిష్టం. పద. చినబాబు ఎక్కడుండాడో ! పోదాంపద.

తాత:_ఉండు. మా యింటిదాకా వెళ్ళొస్తానమ్మా అని అమ్మగారితో చెప్పొస్తా.

(తాతయ్య లోనికిపోయాడు)

యల:_పసిరికపాములాంటోడు చినబాబు. ఆరి దీని తస్సాదియ్యా ! చినబాబునే వలలో ఏసుకుందంటే యిక ఎవరు మాత్రం లెఖ్ఖాఏంటి ? అమ్మయెవ్వా ! బలే ఖిలాడి ! బలే ఖిలాడి.

(తాతయ్య ప్రవేసించాడు. యలమంద, తాతయ్య, యిరువురూ వెళ్ళిపోయారు.)

(కొంతసేపటికి మోహనబాబు ప్రవేశించాడు.)

(మోహనబాబు పూర్తిగా అలసిపోయాడు. చెమటలు కారుతున్నాయి. నలిగిపోయిన దుస్తులు, చెదరిపోయిన ముంగురులు, ప్రాణ గండాన్ని దూసుకుని బయటపడినట్లుంది.)

మోహనబాబు:—తాగుబోతు వెధవలు. తిలోత్తమ వీళ్ళబ్బగంటా? అది నా సొత్తు. నేను దాన్ని మనసార ప్రేమించాను. యీరౌడీ వెధవలు ఎవరు మధ్యని?

(వీధిలోకిచూస్తూ నిలబడిపోయాడు)

(సరళ ప్రవేశించింది)

సర:—ఏమండీ?

(మోహనబాబు సరళ రాకను గమనించాడు. మాట్లాడకుండా వెళ్లి పడక మీద కూర్చున్నాడు.)

సర:—మళ్ళీ కూర్చున్నారేం? ఆకలికావటంలేదూ? భోజనానికి లేవండి.

మోహన్:—అక్కర్లేదు.

సర:—అబ్బా! పొద్దుపోయింది. లేద్దురూ.

మో:—అక్కర్లేదు. నన్నట్టే బాధించకు.

సర:—ఏమిటా చిరాకు?

మో:—అబ్బ! నన్ను చంపెయ్యకు. కాస్తసేపు తాపీగా కూర్చోనియ్యి.

సర:—అయితే భోజనం చెయ్యరూ?

మో:—నా భోజనం అయిపోయింది.

సర:—అదేమిటండి? అన్నీ అబద్ధాలు. ఎక్కడ చేశారు భోజనం?

మో:—అబ్బబ్బ! ఒక స్నేహితుడి యింట్లో.

సర:—ఎవరండి ఆ స్నేహితుడు?

మో:—అదంతా నీకక్కర్లేదు. నీ పనేమిటో చూచుకో.

సర:—నెలరోజుల్నుంచి యిదే తతంగం. మీరెందుకిలా మారిపోయారు? నాలో ఏదైనా లోపం వుందా? చెప్పండి. సరిదిద్దుకుంటాను.

మో—తప్పంతా నాలోనేవుంది.

(మోహన్‌బాబు సిగరెట్టు ముట్టించుకున్నాడు)

సర:—తెలుసునులెండి.

మో:—ఏమిటి?

సర:—మీకృష్ణలీలలు

మో:—ఏమిటా వెధవకవిత్వం?

సర:—ఏమిటో మీ అంతరాత్మ మీకేమీ చెప్పటం లేదూ?

మో:—ఓ! కవిత్వంలోనుంచి జారి వేదాంతంలో పడ్డావు; ఏదీ! నా అంతరాత్మ నాకేమీ చెప్పటంలేదు.

సర:—దానిని నిలువునా హత్యచేశి పారేశారు.

మో:—మెట్టవేదాంతం - చెప్పదలుచుకున్నదేదో సూటిగా చెప్పెయ్యి. నేపడుకోవాలి.

సర:—మీరు యింతవరకు ఎక్కడవున్నట్లు?

మో:—ఒక స్నేహితుడి యింట్లో.

సర:—ఎవరండీ ఆ స్నేహితుడు.

మో:—అంటే?

సర:—ఆడా? లేక మగా?

మో:—...అవును ... మగ.

సర:—కాదు. నాకు తెలుసునులెండి.

మో:—ఏమిటి?

సర:—మీరా తిలోత్తమతో జరుపుతున్న కామకలాపం.

మో:—నోరుముయ్యి.

సర:—ఎందుకు మూయాలండి? నేమూయను. మీరు చెడిపోతున్నారు.

మో:—ఏమిటావాగుడు? అది నా యిష్టం. తిలోత్తమను నేను ప్రేమించాను. అది నన్ను ప్రేమిం

చింది. అది నా ప్రాణం. నీ వెవతెవు మధ్యని పానకంలో పుడకలాగా ?

సర:_అవును - చంపెయ్యండి. మీ పీడ వదలి పోతుంది. ఆ రంకుముండతోనే హాయిగా వుందురుగాని.

మో:_ఆ ! ఏమన్నావ్ ? తిలోత్తమకే వంకలు పెట్టేంతటి దానివయ్యావ్ ? చచ్చుముండ !

(మోహన్ బాబు తన బలాన్ని ప్రయోగించాడు, సరళ నేలమీదపడిపోయింది.)

(సమయానికి తాతయ్య ప్రవేశించాడు)

తాత:_బాబూ ! బాబూ !

(మోహన్ బాబు అట్టే నిలబడిపోయాడు)

సర:_తాతా !

తాత:_అమ్మా ! లోపలికిపద. బాబుగారు చాలా కోపంగా వున్నారు; లోపలికిపోతల్లీ.

(సరళ లోపలికి వెళ్లిపోయింది. మోహన్ బాబు పడకమీద కూలబడిపోయాడు.)

తాత:_మహాలక్ష్మిలాంటి ఇల్లాలు.

మో:_... ...

తాత:_తనలో తానే కుళ్లి కుమిలిపోతూవుంది చినబాబూ! ఆ ఎర్రితల్లి.

మో:_... ...

తాత:_యీ బుద్ధులు మానుకో బాబూ.

మో:_... ...

తాత _ఎంతో మర్యాదగా బ్రతికిన సంసారం. పరువు ప్రతిష్ఠ బుగ్గిపాలుచేయకు చినబాబూ.

(సశేషము)

# మానవుడు - కళిక

(కుమారి సుందరి)

[హిందీలో, "బచ్చన్" కవితా ఆధారము]

మానవుడు:—

బాల్యమందున నా కొంటె పనులవలన
మొగ్గలవి యెన్నో బాధల బొందియుండె;
క్రూర కార్యములని వాని గూర్చి మిగుల
నేడు హృదయమ్మునందు జింతించుచుంటి
కోర్కెతో నేగి కత్తుకల్ కోసి కోసి,
గుండెలో గ్రుచ్చి మాలల గూర్చి కూర్చి,
వెతల దెల్పనేరని, నోరు విప్పలేని
నిన్ను పీడించి సంతసించితిని నేను.
తల్లి యొడిలోన నిద్రించు తనయవనుచు,
విరిసి యందాల జిందెడి విరివటంచు,
తలపకయ గుండె వ్రీల్చి, నిర్దయత కటిక
వాని చందాన నిను గాయపఱచినాడ
కళిక! పరితాపవహ్నికీలలను జిక్కి
యధముడను నేను దుఃఖమ్మునందుచుంటి;
హృదయమును విప్పి 'నిను క్షమియింతు' ననుచు
పలుకు మొకమారు లేనిచో నిలువజాల.

కళిక:—

వెఱ్ఱిమానవుడా! యేల బేలవైతి?
నే నెవర, చిన్నిమొగ్గను నిను క్షమింప,
నింతయయ్యు నీదోషమిందేమి కలదొ,
యరయ నుపకృతి నీదు కార్యమ్ము నాకు.
మూడు దినములలోననె వాడిపోదు,
వ్రాలి దీర్ఘ నిద్రపోదు వసుధపైని,
నిట్టి నే బుట్టి వికసింప నెవరు గాంత్రు?
సుంత నాయాట గాంచి ప్రేమింతురెవరు?
అల్పజీవిని జేరిచి, యంకమందు
ప్రేమ జూపించి నను గౌరవించినావు;
గడియసేపైన మాలనై కంఠమందు
వెలిగితిని గాదె, యదె పదివేలునాకు.

మానవుడు:—

అకట యది నిశ్చలప్రేమయని తలంచి
హృదయముప్పొంగ మురిసి పోయితివె నీవు?
క్షణిక సౌందర్య దాహమ్ముకాని, యద్ది
కాదు నిశ్చలమౌ ప్రేమ కాదు సుమ్ము.
స్వార్థపరుడనై నే జేసినట్టి పనిని
దలచి యుపకారమనుచు నీవలరినావె?
వాడి పోవుచునున్న నిన్ బాఱవైచు
నీయధము క్రూరకార్యమ్ము నెంచరాదె?

కళిక:—

సంసరణ శీలమైన మీజగములోన
నచలమౌ శాశ్వతమగు పదార్థమేది?
జగములో మానవుడుగూడ చలితుడౌను,
మానవుని తోడ హృదయమ్ము మారిపోవు
క్షణికసౌందర్య భరితమౌ తనువు చేత
ప్రాణికోటిని సంతోషపఱచినాను;
పరుల సేవలో గడచిన యరగడియయె
బ్రతుకునందున సార్థకత్వము వహించె.
నిష్ఫలమ్మయి క్షణములో నేలకొఱగు
నాకు సార్థకత్వము గూర్చినావు కాదె!
యొకరికైనను బ్రతుకుపయోగ పడుట
ముదమునభిమానమును నిండె హృదయమందు

# మనము - మన గ్రామాలు

'శంకర'

మనము స్వతంత్రులమయ్యాము. ఆగష్టు 15 పందొమ్మిది వందలనలభై యేడుతో పరపాలనము నుండి బయటపడ్డాము. దేశాన్ని సకల సౌభాగ్యవంతముగా చేసుకొని పరిపాలన సాగించవలసిన బాధ్యత మనపైపడ్డింది. దేశం బాగుపడాలన్నా - ఉన్నత శిఖరాలు అందుకోవాలన్నా దేశప్రజలమైన మనం బాగుపడాలి. మనపల్లెగ్రామాలు బాగుపడాలి. మన పల్లెప్రజలు బాగుపడాలి. గ్రామం స్వయంపోషకముగాను, సకల సౌభాగ్యవంతముగాను వుండాలి. స్వయం పోషక మంటేను, సౌభాగ్యవంతమంటేను ఏమిటో మనము ముందు తెలుసుకోవాలి.

ఏ గ్రామానికి ఆగ్రామం నిత్యజీవితానికి కావలసిన సరుకులను స్వయం కృషిమీద సంపాదించుకోవాలి. జీవితావసరములైన కడుపునిండిన తిండి, వళ్ళునిండిన బట్ట, ఉండటానికి ఇల్లు, మెదడుకి విజ్ఞానము సమకూర్చుకోవాలి.

భగవత్ప్రసాదితమైన దేహాన్ని శుచిగాను, సుందరముగాను వుంచుకొనడమే కాకుండా, ఈ దేహానికి అత్యంత ఆవశ్యకమైన గృహాన్నీ గృహ పరిసరాల్నీ, మన పల్లెనంతటినీ ఆరోగ్యవంతముగా నుంచుకొని ఆనందమయ జీవితాన్ని గడపాలి. అన్నీ ఉండి ఆరోగ్యంలేకపోతే ప్రయోజనం లేదు. అందుచేతనే ఆరోగ్యమే మహాభాగ్యమని అంటున్నారు. ఏభాగ్యం యెట్లావున్నా ఆయుర్భాగ్యం ఉంటేకదా అనుభవించటానికి? అందుచేత ఆరోగ్యవంతముగా జీవించాలి. స్వయం కృషిమీద సమస్తము సంపాదించుకోవాలి. ఇది గ్రామజీవితం యొక్క పరమార్థము. ఈపరమార్థమును సాధించటానికే మహాత్ముడు తనజీవిత పర్యంతము కృషిచేశాడు.

ఆ మహాత్ముడు ఏమితలచినా, ఏదిచెప్పినా, ఏ పనిచేసినా ఏడులక్షల ఏబదివేల గ్రామాలలో నివసించే ప్రజలను తనదృష్టిలో పెట్టుకొనే, ఆలోచించేవాడు. అవే తన అనుచరులకు బోధించేవాడు. వాటినే తను ఆచరణలో పెట్టేవాడు.

గ్రామజీవితం ఎంత స్వయంపోషకంగావుంటుందో, భారతదేశం అంత ఆర్థికంగా అత్యున్నత స్థాయిని అందుకుంటుంది. గ్రామస్థులు ఎంత ఆరోగ్యవంతముగా వుంటారో - భారతీయులు అంత ఆనందమయ జీవితాన్ని గడుపుతారు - తమ గ్రామపరిపాలనలో, ఎంతనైపుణ్యాన్ని, కుశాగ్రబుద్ధిని, సమత్వ భావాన్ని మానవసేవాభిలాషను - కనబరుస్తారో - అంతటి రాజనీతిజ్ఞులు ఈ నవభారత నిర్మాణానికి తయారవతారు.

పంచాయితీలు, రాజనీతిజ్ఞులకు ప్రాథమిక పాఠశాలల వంటివి. శుచిశుభ్రతలు, క్రమపద్ధతులు, పరసహనము, పరిపాలనా దక్షత, సమరసభావము, సర్వమానవ సమానత్వము, దీక్ష - కృషి - త్యాగము యీ సద్గుణములన్నీ గ్రామజీవనానికీ, గ్రామపరిపాలనకీ పట్టుకొమ్మలే. స్వగ్రామ పరిపాలనలో సహజ పండితుడైనవాడు - స్వదేశపరిపాలనలో సంపూర్ణ విద్వాంసుడు కావడానికి సందేహంలేదు.

తన గ్రామంలో ఏ దుర్గుణాలు అలవర్చుకుంటాడో ఆ దుర్గుణాలే దేశవ్యాప్తం చేయబోతాడు. తన గ్రామాన్ని ఎంత అధోగతిలో వుంచుకుంటాడో-తన దేశాన్ని అంత దీనావస్థకు తీసుకువస్తాడు. అందుచేతనే ప్రజలదృష్టీ-పరిపాలకుల దృష్టీ గ్రామాల మీదకు త్రిప్పాలంటున్నారు.

ఈ నాటి గ్రామాలు సౌభాగ్యవంతముగా లేవు. గ్రామప్రజలు స్వయంపోషకంగా లేరు. గ్రామాలలో

పరిశుభ్రత కనబడటంలేదు. కష్టాలు, కార్పణ్యాలకు ఆలవాలమవుతున్నాయి.

పూర్వమొకప్పుడు మహోన్నత దశలో వుండి యుండవచ్చు. కాలం మారింది. పరిస్థితులు తారుమారయినాయి. సనాతనపు అలవాట్లుకీ-ఆధునాతనపు అభిరుచులకీ తేడా కనబడుతోంది. ఈ మార్పిడిలో మన గ్రామప్రజలు కొట్టుమిట్టాడుతున్నారు. పూర్తిగా సనాతనపు పద్ధతులను అభిమానించలేరు. అధునాతనపు పద్ధతులను అలవాటు చేసుకోలేరు. ఉభయభ్రష్టుత్వం-ఉపరి సన్యాసం మిగిలింది. ఎక్కడ చూసినా బద్దకం-ఆలస్యం-అనారోగ్యం-అసహనం-అన్యాయం-స్వార్థం-అవిద్య-అజ్ఞానం తాండవిస్తున్నాయి. సాంఘిక పరిజ్ఞాన శూన్యత, సహకార భావనాలేమి తాళం వేస్తున్నాయి. నవనాగరికపు దొంగలు-తిండిపోతురాయళ్ళూ-ఈ ప్రళయతాండవాన్ని చూసి ఆనందిస్తున్నారు!

ఈ పరిస్థితి మారాలి. మారి తీరాలి. మన గ్రామాలు పునర్నిర్మాణం కావాలి. మన గ్రామ ప్రజలందరూ కృషి చెయ్యాలి. 'కృషితో నాస్తి దుర్భిక్షం' అనే ధర్మసూత్రాన్ని అవగతం చేసుకోవాలి. ఆలస్యం పనికిరాదు. బద్ధకం పరమదరిద్రం. అన్యాయం అసహనం రూపుమాసి పోవాలి. ఆశ్రిత పక్షపాతం అడుగంటిపోవాలి. కులమత విభేదాలు కూకటి వ్రేళ్ళతో పీకి పారెయ్యాలి. సాంఘిక పరిజ్ఞానాన్ని-సహకార భావాన్ని అలవరచుకోవాలి.

మానవుడు సంఘజీవి. తన బ్రతుకు తన కోసమే కాదు. తన సంఘం కోసమని గుర్తించాలి. తను తన ఇల్లూ వాకిలి, తన భార్యా పిల్లలు, తన ఇరుగూ పొరుగూ తన పల్లె పరిసర ప్రాంతాలూ తను బాగు చేసుకోవాలి. ఆరోగ్యవంతముగా వుంచుకోవాలి. ఆనందమయ జీవితాన్ని గడపాలి.

ఆనందము ఎక్కడవుంది? అజ్ఞానంలో లేదు, అసహనంలో లేదు, అనారోగ్యంలో లేదు, పొట్టకింత తినడంలో లేదు, స్వార్థంతో సంపాదించిన అర్థంలో అసలే లేదు. తను ఏది కోరుకుంటాడో అదే తనతోటి మానవులు కూడా కోరుతున్నారని తెలుసుకోవడంలో వుంది ఆనందం. నీవు ఏది చెప్పినా నీకూ ఇతరులకూ ఆనందంగా వుండాలి. నీవు ఏది చేసినా నీకు ఇతరులకూ లాభంగా వుండాలి. అదీ జ్ఞానం, అదీ విద్య. అది లేకపోతే ఎన్ని వున్నా బూడిదలో పోసిన పన్నీరు, అడవిని గాచిన వెన్నెల-నిరర్థకం, నిష్ప్రయోజనం తెలిసిందా!

ఉన్నది పుష్టి మానవుడికి. తిన్నది పుష్టి గొడ్డుకి, అంటారు జ్ఞాపకంలేదూ? ఈ ఉండటం నీ ఒక్కడికే కాదు. అందరికీ వుండాలి. అప్పుడే నీకు సౌఖ్యం. ఆనాడే నీకు ఆనందం. ఆవేళే నీకు ఆరోగ్యం. సకల సౌభాగ్యం.

కోట్లకొలదీ ప్రజల రక్తం పీల్చుకు తింటూ ఒక్కడు ఎన్నాళ్ళు మనగలుగుతాడు? మన కళ్ళయెదుట ఏమి జరిగినదీ మనకు తెలియదూ? ఆ సేతు హిమాచల పర్యంతముగల భారత ప్రజలను బానిసలుగా చేసి, గర్భదరిద్రులుగా నొనర్చి కోట్లకొలదీ ద్రవ్యాన్ని తమ దేశానికి తరలించుకొని పోయిన బ్రిటిష్ ప్రభుత్వం ఇప్పుడు ఏమయింది? ఆగస్టు 15-1947 తో అంతమైపో లేదూ!

తమ గ్రామాలను అధోగతిలో వుంచి, గ్రామ ప్రజలను పీల్చి పిప్పిచేసిన గ్రామ ప్రభువులు జమీందార్లూ ఏమయ్యారు? వారనుభవించిన రాజభోగాలు, రేసుకోర్సులూ, ఎక్కడి కెళ్ళాయి? నామరూపాలు లేకుండా నాశనమై పోయాయి కాదూ!

కృషి చేసేవాడు అన్నమోగామచంద్రాయని కృశించి పోతూవుంటే-ఆ కృషి ఫలితాన్ని అనుభవిస్తూ ఎంతకాలం దులకడానికి వీలవుతుంది? అందుచేత స్వార్థం పనికిరాదు. ఎంతో కాలం సాగదు. సకలార్థ సాధకంగాను, సకల మానవ కళ్యాణాత్మకంగాను చేసిన పనులే స్థిరంగాను ఇహపర సాధనంగాను వుంటాయి. ఇహమంటే ఈ లోకమనీ-పరమంటే ఏదో స్వర్గమనీ కాదు నా అభిప్రాయం. ఇహమంటే నీకు, పరమంటే ఇతరులకు అని సమన్వయం చేసుకుంటే చాలు.

మానవ సేవయే మాధవ సేవన్నారు. కాలిక్రింద గల శిలయు గర్భగుడిలోని శివలింగము వస్తుతత్వం చేత ఒకటే అయినా శివలింగాన్ని విడిచిపెట్టి శిలల నారాధించే మూర్ఖులుంటారా? తోడి మానవులను దోపిడి చేసి, కొల్లగొట్టి, అధఃపాతాళ లోకంలోకి అణచివేసి అజ్ఞానాంధకారంలోకి త్రోసివేసి నీ వొక్కడవే అందల మెక్కి కూర్చుని కోటి లింగాల స్వామికి కొబ్బరి కాయలు కొట్టితే సరిపోతుందా? "దేశమంటే మట్టికాదోయి. దేశమంటే మనుషులోయి" అన్నాడు! గురజాడ మహాకవి, జ్ఞాపకం లేదూ? అందుచేత దేశప్రజలకు సేవచెయ్యి దేముడిని కొల్చినట్లే అవుతుంది. దేశం బాగుపడాలన్నా, ఉన్నత శిఖరాలందుకోవాలన్నా దేశంలోని ప్రజలు అంటే మన పల్లెవాసులు బాగుపడాలి, అనాడుగాని మనం కష్టపడి సాధించిన స్వాతంత్ర్యం సార్థకము కాబోదు అప్పుడుగాని మనము స్వతంత్ర భారతావనికి స్వతంత్ర భారత పౌరులమని అనుకోలేము.

మనం ఆర్థికంగా బాగుపడాలన్నా సాంఘికముగా సుఖజీవనం గడుపాలన్నా, రాజకీయంగా కీర్తి ప్రతిష్ఠలు సంపాదించాలన్నా, మన గ్రామాలు స్వయం పోషకంగా తయారు కావాలి. మన గ్రామప్రజలు నిరంతర కృషి చేసుకోవాలి. నిరుద్యోగం నిర్మూలించాలి. సాంఘిక సేవాసంఘాలు, సహకార సంస్థలు, గ్రామాలలో సవ్యంగా నడుపుకోవాలి. గ్రామపంచాయితీలు సక్రమంగా పరిపాలన సాగించాలి.

యుక్త వయస్సు వచ్చిన ప్రతి స్త్రీ పురుషుడికీ తన ప్రతినిధిని ఎన్నుకునే హక్కు ఏర్పడింది. ఆ ఓటును విక్రయించి దుర్వినియోగ పరుచకూడదు. అధికారులు అనధికారులు కూడ ప్రజలకు ఉపన్యాసము లిచ్చి ఊరుకోవడంతో ప్రయోజనంలేదు. ఆడవాళ్ళకు మొగవాళ్ళకు పిల్లలకు కూడ సాంఘిక జీవనము, స్వయం కృషి, సహకార పద్ధతి నేర్పించాలి. స్వయంగా పనిచేసి చూపించాలి. తాము కూడ ఆ పల్లె వాడల్లో ఒకరై జీవించాలి—ఏదో మాసానికో సారి హేటూ బూటూ వేసుకొని ఏ పట్టణంనుంచో ఫస్టుక్లాసు రైలు పెట్టె నుండో, ఫియట్ కారులో నుంచో దిగి గ్రామాలకు వెళ్ళి మీరు "ఇవి చేసుకోండి, అవి చేసుకోండి" అని చెప్పి చక్కాబోతే లాభంలేదు. ప్రభుత్వంవారు చేసి చూపించినా ప్రయోజనం లేదు. ప్రజలతో నివసించాలి. వారిలో ఆసక్తి పుట్టించాలి. వారిచేతనే చేయించాలి.

ప్రతి గ్రామంనుంచీ కాస్తో కూస్తో చదువుకున్న యువకులను ఒక కేంద్రానికి రప్పించి, గ్రామ పునర్నిర్మాణంలో శిక్షణ యివ్వాలి. అట్లా శిక్షణ పొందిన యువకులు వారి గ్రామాలకు పోయి ఆ పద్ధతులు అమలు పర్చాలి. గవర్నమెంటువారు ఏవిధమైన ఆర్థిక సహాయము, జీతభత్యములు ఈ సంఘ సేవకులకు ఏర్పాటు చేయడం మంచిదికాదు. అట్లా చేస్తే ప్రజలకు ప్రభుత్వంవారు ఈ సేవకులద్వారా చేయించే ప్రబోధాలమీద, ఏర్పాటులమీద నమ్మకం కలుగదు. "ఇవి ప్రజలు చేసుకొనేవికావు, ప్రభుత్వమే చేస్తుంది కాబోలనుకుంటారు."

క్రమశిక్షణ పొందిన యువకులే వారి గ్రామాలకు వెళ్ళి వారి ప్రజలలో 'ఆసక్తి'ని కలిగించి, గ్రామాభివృద్ధికీ, పునస్సృష్టికీ. కావలసిన పథకాలు వేసుకోవడం ఆ పథకాలు ప్రజాశక్తి మీదనే అమలు పెట్టడం జరిగించాలి. ప్రభుత్వము తగు సలహాలు మాత్రం యిస్తూ వుండవచ్చు. వస్తు రూపంలో సహాయమును చేయవచ్చు. అట్లాంటి సేవాసక్తి గల యువకులు ప్రతి గ్రామంలోను ఒకరిద్దరు దొరుకకపోరు. అంతగా దొరుకని పక్షంలో పరిసర గ్రామాలనుంచి యువకులకు శిక్షణ యిచ్చి అట్టి పల్లెగ్రామాలకు వలస పంపే ఏర్పాట్లు చేయాలి. ఆ యువకులు ఆ గ్రామంలోనే నివసించాలి.

శిక్షణ పొందిన యువకులుగాని, ప్రభుత్వాధికారులుగాని ప్రతి చిన్న విషయంలోను శ్రద్ధ తీసుకుంటూ ఆదర్శంగా తమకు తాము నడుచుకుంటూ గ్రామాభి వృద్ధికీ, గ్రామ పునర్నిర్మాణానికీ తోడు పడాలి.

భగవంతుడిచ్చిన గాలి, నీరు, వెల్తురు, భూమి,

భూసంపదనీ మానవుడు సద్వినియోగ పర్చడం నేర్చుకుంటే, అదే సౌభాగ్యానికి దారి తీస్తుంది. వాటిని ఉపేక్ష చేసి ఊరుకుంటే, దరిద్రానికి కారణమవుతుంది. సూర్యోదయం లగాయతు సూర్యాస్తమయంవరకూ ప్రతి మానవుడూ ఏదో ఒక విధమైన 'కృషి' చేస్తూనే వుండాలి. అది వెంటనే మనకి లాభించకపోవచ్చు. చేసిన కృషి మాత్రం ఎన్నటికీ వృధాపోదు. కృషిచేసి విడిచిపెట్టిన లేదా దాచిపెట్టినదే, భవిష్యత్తులో మూల ధనమై మరింత భాగ్యసేకరణకు ఉపయోగ పడుతుందికదా!

గ్రామంలో తెలుసుకోవలసిన విషయాలు విశేషంగా వున్నాయి. గ్రామాభివృద్ధికి చేయవలసిన పనులు చాలా వున్నాయి.

ఒక్కొక్క గ్రామంలో ఎంతమంది ప్రజలు నివసిస్తున్నారు. అందులో ఆడవాళ్ళెంతమంది, మొగవాళ్ళెంతమంది? చంటిపిల్లలు,వృద్ధులు, వికలాంగులు ఎంతమంది వున్నారు? ఏయే వృత్తులమీద ఆధారపడి జీవిస్తున్నారు? వారు అవలంబించే వృత్తులకీ, అక్కడ ప్రకృతి ప్రసాదించిన వస్తు సముదాయానికీ సంబంధము వున్నదా లేదా? వాటిని వారు సవ్యంగా ఉపయోగిస్తున్నారా? లేదా? వృధాపోతున్నాయా? అతడు అవలంబించే వృత్తివల్ల అతని కుటుంబ పోషణ కుంటు పడకుండా నడుస్తోందా? అతడు చేసిన కృషి ఫలితాన్ని అనుభవించేవారు, ఉపయోగించేవారు అసలు ఆ గ్రామంలో వున్నారా? లేక ఆ కృషి ఫలితాన్ని ఇతర ప్రదేశాలకు అందజేసి, అతని దైనిక జీవితానికీ అవసరాలకూ సరిపడే వస్తు సముదాయాన్ని అందచేయగల ఏర్పాట్లు ఏమైనా చేయవలసి వున్నదా? అతడి వృత్తికి కావలసిన పెట్టుబడి, ముడి సరుకులు, పనిముట్లు అందచేయవలసిన అవసరం వున్నదా, పనిముట్లు, అభివృద్ధిపరిచే అవకాశం ఎంత వరకూ వుంది?

ఆ పల్లెలో వీధులెల్లావున్నాయి? వీధిని అంటిపెట్టుకొని వున్న ఇళ్ళూ వాకిళ్ళూ ఏ పరిస్థితుల్లో వున్నాయి? ఆరోగ్యానికీ ఆనంద జీవితానికీ దోహదం చేస్తున్నాయా? గాలి, నీరు, వెల్తురు పరిశుభ్రంగా వున్నాయా?

చదువుకోటానికి బదులూ, వినోద కాలక్షేపాలకు వీధి పావిళ్ళూ, రాకపోకలకు రహదారీ సౌకర్యాలు ఎట్లావున్నాయి? రోగం వచ్చినా రొచ్చువచ్చినా ఆ గ్రామప్రజలు ఏవిధంగా వైద్య సహాయాన్ని పొందగలుగుతున్నారు? బయట ప్రపంచముతో ఆ పల్లె గ్రామానికి సంబంధ బాంధవ్యాలను కలుపుకోటానికీ, దాని సమాచారాలు తెలుసుకోటానికీ అవకాశం వున్నదా? వార్తాపత్రికలు, వాహన సౌకర్యాలు ఏ స్థితిలో వున్నాయి?

ప్రజలలో ఐకమత్యం ఎలావుంది? కక్షలు, కార్పణ్యాలు ఏమైనా వున్నాయా? ఇవి ఏ స్వరూపంలో వున్నాయి? కులానికీ మతానికీ సంబంధించినవా? లేక రాజకీయాలకే పరిమితమై వున్నాయా? వీటిని సమరస భావంతో పరిష్కరించి గ్రామాభివృద్ధికి దోహదం చేసే అవకాశం వున్నదా?

జీవిత పరిమాణం ఏ స్థితిలోవుంది. ఆ పల్లెవాసుల్లో ఎంతమంది సుఖజీవనాన్ని గడుపుతున్నారు. ఆధునిక జీవిత విధానం ఎంతవరకు తెలుసుకున్నారు? సదవకాశాలు అందరికీ అందుబాటులో వున్నాయా?

ఆ పల్లెవాసులు స్వాతంత్ర్యం అనుభవిస్తున్నారా? బానిసలుగా బ్రతుకును ఈడుస్తున్నారా? క్రమపద్ధతి ఆ గ్రామంలో కనబడుతోందా? ఏ ఒకరిద్దరి ఆసాముల మీదనో ఆధారపడి, వారి చెప్పు చేతలలో నడుచుకుంటూ వారి స్వార్థాలకి గురి అవుతున్నారా? ఎవడి ఇంటికి వాడు ఖామందునని, ఎవడికి వాడు స్వతంత్రముగా మంచి చెడ్డలు తెలుసుకొని మసలుకుంటున్నారా? జనరల్ ఎలెక్షనులో ఎంతమంది పాల్గొన్నారు.

గ్రామజీవితంలో, గ్రామ పారిశుధ్యంలో, గ్రామ పరిపాలనలో ప్రజలు శ్రద్ధచూపుతున్నారా? ఎవరో చేస్తున్నారనీ, వారే చేయాలనీ, తాము అనుభవిస్తున్నా

మనీ అనుకుంటున్నారా ? ఆ గ్రామం వారిదే అనీ ఆ గ్రామంలో ఏమి లోటువున్నా వారికే అనర్థదాయక మనీ గ్రహిస్తున్నారా ?

ఇవీ ప్రశ్నలు. వీటికి సవ్యమైన సమాధానాలు రావాలి. లోటుపాట్లు లేకుండా చేయాలి. ఆధునిక మార్గాలు అన్వేషించాలి. అవి అక్షరాలా అనుసరించాలి. ఆ నాడు పల్లెగ్రామాలు బాగుపడుతాయి. పల్లెవాసులు హాయిగా బ్రతుకగల్గుతారు. భారత దేశం అత్యున్నత స్థానాన్ని అందుకుంటుంది.

ఈ పుస్తకం పల్లెగ్రామాల సర్వతోముఖాభివృద్ధికీ సమస్యా పరిష్కారానికీ, ఏ మాత్రం సహాకరించినా, గ్రామపునర్నిర్మాణోద్యమానికి తన జీవితాన్ని అంకితం చేసిన మహాత్ముని ఆత్మ శాంతిస్తుంది. ఆయన అనుచరుల మైన మా జన్మ తరిస్తుంది.

---

## ఛాయ చిత్ర వివరములు

పైనుండి క్రిందికి వరుసగా 1. మొదటి అమెరికా ప్రెసిడెంటు భార్య మార్తావాషింగ్‌టన్ 2. అమెరికన్ రెడ్ క్రాస్‌ను స్థాపించిన క్లారాబార్టన్ 3. 19వ శతాబ్దపు రచయిత్రి లోయిసా మే ఆల్‌కాట్ 4. రెండవ ప్రపంచ యుద్ధంలో సైనిక, నావిక, వైమానిక దళాలలో పనిచేసిన మహిళల గౌరవార్థం వెలువడిన బిళ్ళ 5. యునైటెడ్ స్టేట్స్‌లో మొట్టమొదట బాలికా పాఠశాలను స్థాపించిన జూలియట్ గార్డన్‌లో.

పైనుండి రెండవ వరుసలో 1. 1931 లో రెడ్ క్రాస్ 50వ వార్షికోత్సవ సందర్భమున జారీ చేయబడిన రెడ్ క్రాస్ నర్సుబిళ్ళ. 2. మొట్టమొదట రొనోకేద్వీపమునకు (యిప్పటి వర్జీనియా)కు వలసవెళ్ళిన ఆంగ్లేయులకు జన్మించిన బాలిక 'వర్జీనియాడేర్' 3. మహిళల క్రైస్తవటెంపరెన్సు సంఘపు స్థాపకురాలు ఫ్రాన్సిస్ ఇవిలర్డ్ 4. యుద్ధంలో తమ కుమారులను కోల్పోయిన తల్లుల గౌరవార్థం జారీచేయబడిన 'గోల్డుస్టార్ మదర్స్,' తపాలాబిళ్ళ, అమెరికన్ జాతీయ పతాకమును రూపొందించిన మహిళ బెట్సిరోసా స్మారకార్థం వెలువడినది.

మూడవ వరుసలో పైనుండి 1. మహిళకు ఓటింగ్ హక్కుకై రాజ్యాంగ చట్టంలో సవరణను ప్రతిపాదించి సాధించిన సుసాన్ బి. అంతోని 2. తన తల్లి గౌరవార్థం ఆమె ప్రఖ్యాత చిత్రమును పునర్నిర్మించి అమెరికన్ తల్లులను జె. మెక్‌నీల్ విసలర్ గౌరవించిన సందర్భపుతపాలాబిళ్ళ

1931 లో నోబిల్ బహుమానమును పొందిన నారీమణి జేన్ ఆడమ్స్ 4. మహిళాభ్యుదయాన్ని స్మరించుటకుగాను స్త్రీల హక్కులకొరకు ఉద్యమము నడిపిన ముగ్గురు ప్రముఖ మహిళల నాయకు రాండ్రను చిత్రించి జారీ చేయబడిన పోస్టు బిళ్ళ, 5. వికలాంగులగు వీరులకు, వారికుటుంబాలకు సహాయార్థం నిధిని వసూలు చేయడానికి ఏర్పడిన పప్పీడే ఉద్దేశాన్ని మొదట వెలిబుచ్చిన మోనామైకేల్.

శ్రీమతి

# యామినీపూర్ణతిలకమ్మ కాలధర్మం

## ప్రసిద్ధ దేశసేవిక, కవయిత్రి

శ్రీమతి యామినీపూర్ణ తిలకమ్మగారు **అడయార్‌లోని కాన్సర్ ఆసుపత్రిలో** **16-వ** తేదీన స్వర్గస్థురాలయ్యారు.

**1919** వ సంవత్సరంలో ఈమె గాంధీజీ శిష్యురాలై స్వాతంత్ర్యోద్యమంలోను, ఖద్దరు వుద్యమంలోను చేరి ఆంధ్ర దేశానికి అమోఘమైన సేవ చేశారు. ఆ సందర్భంలో ఈమె జైలుకుకూడా వెళ్ళారు. ఈమె సంగీతంలోను సాహిత్యంలోను ప్రవీణురాలు. గొప్ప వక్త, కవయిత్రి.

కళావంతులలో వివాహోద్యమాన్ని 1921 లో ప్రారంభించి 1930 వరకు ఆంధ్ర దేశానికి చేసిన సేవ అద్వితీయమైనది. ఈ వుద్యమంలో ఈమెతో కలిసి పనిచేసే భాగ్యం నాకుకూడా కలిగింది. ఆధునిక ఆంధ్ర సంఘ సంస్కరణ చరిత్రలో ఒక ముఖ్య విషయమైన ఈ వుద్యమాన్ని గురించి ఈ తరం ఆంధ్రులకు తెలుపడానికి వ్రాస్తున్నాను.

**1920-21** లో నేను అడయార్ నేషనల్ యూనివర్సిటీలో వుపన్యాసకుడుగా పనిచేయుచుంటిని. తిలకమ్మగారు, తన కొమార్తెకు వైద్యసహాయం కొరకు మద్రాసువచ్చి మా ఇంటిలో బసచేశారు. నాకు క్రొత్తవారైనా ఆమె చేస్తున్న దేశ సేవను గురించి వార్తా పత్రికలలో చదువుచుంటిని. ఈ ఆంధ్ర మహిళామణిని చూడవలెనని ఎంతో కుతూహలపడుచుంటిని.

దేవదాసీల కష్ట జీవితమును, నీచ వృత్తిని గురించి ఎంతో చెప్పుతూ, వారికి వివాహాలు చేయించవలసిన అవసరాన్ని, వారిని అభివృద్ధికి తీసుకొనిరావలసిన దేశ భక్తుల కర్తవ్యాన్ని గురించి నాకు తిలకమ్మగారు బోధించుచుండిరి. అప్పటికే పది సంవత్సరాలుగా ఈ సంస్కరణను ప్రవేశపెట్టుటకు ఆమె ప్రయత్నించి విఫలులైరి. చెప్పిన విషయాన్నే నాకు చెబుతూ కంటనీరు పెట్టుకొనుచు, నా కంట నీరు తెప్పించుచుండిరి. నేనుకూడా ఆమె అభిప్రాయాలతో ఏకీభవించితిని. వివాహాలు చేయించుటకు సహాయపడతానని, ఒక వుద్యమాన్ని స్థాపించుదామని నేను చెప్పినప్పుడు ఆమెకు ఆశ్చర్యం వేసింది. ''కళావంతులకు చేయించడం సులభమనుకొంటిరా?'' అని నన్ను

ప్రశ్నించసాగిరి. ''సులభమేను'' అని నేను సమాధానం చెప్పినప్పుడు, నేను పిచ్చివాని లాగు మాట్లాడుచుండినట్లు ఆమె సంశ యించిరి.

నేను పిచ్చివాడనుకానని, నేను కాల పరిస్థితులను సరిగానే గ్రహించితినని నిరూ పించవలసివచ్చినది. మన దేశంలో, మన సంఘంలో ఎన్నో అమానుషమైన దురా చారాలు ఎన్నో వందల ఏండ్లుగా స్థిరపడి పోయినవి. ఎందరో మహానుభావులు వాటిని తొలగించుటకు ప్రయత్నించి, విఫలులైరి. కాని, మన అదృష్టం పండి, మహాత్మా గాంధిగారు మన దేశ నాయకుడయ్యారు. ప్రజలలో వుంటూవుండిన సంఘ దురా చారాలు నశించి, సంఘం సంస్కరింపబడ నంతవరకు, ప్రజలలో నైతిక జీవితము కొరకు తృష్ణ ఏర్పడనంతవరకు మనకు ప్రపంచంలో గౌరవస్థానంగాని, స్వరాజ్య ప్రభుత్వంగాని లభించజాలవని మనకు చైతన్యం కలుగజేశారు. కార్యసిద్ధికి పూనుకోవలసినదని, మనము కార్యశూరు లము కావలసిందని బోధించారు. ఆ కాలం యువకులు దేశ స్వాతంత్ర్యంకొరకు ఎంతైనా త్యాగం చేయుటకు సంసిద్ధు లయ్యారు. కాబట్టి దేశాభ్యుదయంకొరకు, నైతిక జీవితం కొరకు సంస్థలను నిర్మించి, హృదయ పూర్వకంగా కృషిచేసే నాయకు లకు దేశభక్తులయిన యువకుల సానుభూతి వుండిన కాలం అది. అట్టి నైతిక వాతా వరణాన్ని గాంధిగారు సంఘంలో నిర్మిం చారు. అందువల్ల, సంఘంలో వంశ పారంపర్యంగా అమలులోనుండిన దురా చారాలను మొదలంట నాశనంచేయుటకు సరియైన పునాదిని గాంధిగారు వేశారు. ఆ పరిస్థితులను వుపయోగించుకోగల నాయ కులు ఏర్పడాలి. కళావంతుల సంకెళ్లను పగులగొట్టుటకు, వారి జీవితములను గౌర వంగా, సుఖంగా, గడుపుకొనుటకు తగిన సమయం వచ్చిందని తిలకమ్మగారికి నచ్చ చెప్పి, కార్యాచరణకు నాయకత్వమునకు పురిగొల్పితిని. ఆమె ఇట్టి వుద్యమాన్ని స్థాపించి, హృదయ పూర్వకంగా సేవచేస్తే, ఆమె జయించగల సమర్థురాలని నాకు దృఢమైన నమ్మకం కలిగింది.

అడయార్‌లో అప్పుడు (1920-21) ఒక సభ జరిపి, కళావంతుల సంఘ సంస్క రణోద్యమమును స్థాపించి, సంఘ సంస్కర్త యైన శ్రీ ఎం. వెంకట్రావుగారిని అధ్య క్షులుగాను, శ్రీమతి తిలకమ్మగారిని కార్యదర్శినిగాను, నన్ను కోశాధిపతిగాను ఏర్పాటు చేసుకొంటిమి. దేవదాసీ వృత్తిని నిర్మూలించుటకు, వారికి వివాహములు చేయించుటకు, వారి బీద బాలికలకు ఒక శరణాలయమును స్థాపించుటకు, ఒక వార పత్రికను నెలకొల్పుటకు తీర్మానించితిమి.

ఈ విషయాలను గురించి ఒక

వ్యాసము వ్రాసి, దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారిని దర్శించితిని. అడిగి అడుగకమునుపే తన చేత నయినంత సహాయం ఆంధ్రపత్రిక ద్వారా చేయుటకు సమ్మతించిరి. నా వ్యాసమును ఆంధ్ర పత్రికలో ప్రకటించారు. ఆ వ్యాసము చివర భాగంలో ఈ విధంగా విన్నవించుకొంటిని: ఈ వుద్యమము మంచిదని, అవసరమని నమ్మినవారు తమ అభిప్రాయములను నాకు నేరుగా గాని, ఆంధ్రపత్రిక ద్వారాగాని వ్రాయవలసిందని కోరితిని. ఎందరెందరో సహాయం చేస్తామని వ్రాసిరి. ఆ వుత్తరాలన్నింటిని పంతులుగారు ఆంధ్ర పత్రికలో ప్రచురించిరి. అట్టి సహాయంతో మా వుద్యమానికి ఎంతో ప్రచారం జరిగింది. శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి సహాయం లేకపోతే, ఆ వుద్యమం ఏమయివుండేదో గదా!

నా మిత్రుడు శ్రీ పి. జె. వెంకయ్యగారు ప్రారంభ ఖర్చులకు కావలసిన ద్రవ్య సహాయం చేశారు. మాకు అంతవరకు వచ్చిన వుత్తరాలను బట్టి, ఎంతో ధైర్యం కలిగింది. ముఖ్యంగా నలుగురు వ్యక్తులు నాకు జ్ఞాపకం వస్తూవున్నారు. నర్సాపురం వాస్తవ్యులు ఈశ్వరుడుగారు, గుంటూరు వాస్తవ్యులు మద్దెల ముక్కంటిగారు, హైదరాబాద్ వాస్తవ్యులు శ్యామారావుగారు, బాజీ కృష్ణారావుగారు.

అలాంటివారిని కలుసుకొని, ఆయా నగరాల్లో, పట్టణాల్లో బహిరంగ సభలు పెట్టి, స్థానిక సంఘాలను స్థాపించి, వార్తాపత్రికకు డబ్బు వసూలు చేసి, ఒక కాన్ఫరెన్సుకు ఏర్పాటుచేసి రమ్మని తిలకమ్మగారిని పంపితిమి. ఈమె ఆనందానికి అంతంలేదు. తన జీవితమంతా కలలు గంటున్న పవిత్రమైన వుద్యమం నెరవేరగలదనే నమ్మకంతో తిలకమ్మగారు బయలుదేరారు. దేశ స్వాతంత్ర్యోద్యమంలో ఆరితేరినందున సులభంగానే పై కార్యములనుచేసుకొని రాగలిగిరి. మొదట నర్సాపురం వెళ్లారు. అచట బహిరంగ సభలో ఒక కళావతి తన వృత్తిని మానేసి వుద్యమానికి సేవ చేస్తానని, ఉపాధ్యాయ వృత్తిని అభ్యసించుతానని, తిలకమ్మగారిని సహాయం చెయ్యవలసిందని కోరిరి. ఆమెలాంటి అనాథలను పోషించి వృద్ధికి తెచ్చుటకు, ద్రవ్యము లేదని చెప్పి, తిలకమ్మగారు విచారపడిరి. అప్పుడప్పుడే న్యాయవాద వృత్తిని ప్రారంభించిన శ్రీయద్రమిల్లి నారాయణమూర్తి పంతులుగారు ఆ కళావతి వుపాధ్యాయ వృత్తికి తయారయ్యేవరకు స్కాలర్‌షిప్ ఇచ్చి పోషించుతానని ఆ బహిరంగ సభలోనే వాగ్దానం చేసిరి. అలాగే ప్రతినగరంలోను కష్టములను జయించుకొనుచూ, తిలకమ్మ

(219-వ పేజీ చూడుడు)

# నేటి మానవుడు

మూలం :
శ్రీ ఎం. శ్రీరాజేశ్వర ప్రసాద్ ఎం. ఎ.

అనువాదం :
శ్రీ నిరాఘాటం కుమారస్వామి



సృష్టిలోని సమస్త శ్రేష్ఠపదార్థమంతా పురుష నిర్మాణంలో బ్రహ్మ వ్యయపరిచాడు. తర్వాత పురుషుడు ఒంటరిగా నాకేమీ తోచటంలేదన్నాడు బ్రహ్మతో. బ్రహ్మ కమలంనుండి కోమలత్వాన్ని, సూర్యునినుండి వేడిమిని, సారస పక్షులనుండి దాంపత్య ప్రేమను తీసికొని, స్త్రీని సృష్టించి పురుషున కిచ్చాడు. ఆ స్త్రీని గ్రహించి పురుషుడు అత్యంత సంతుష్టుడైనాడు.

కొన్ని రోజుల తర్వాత పురుషుడు మరల బ్రహ్మ దగ్గరకు వెళ్ళాడు. 'భగవాన్! ఈ స్త్రీతో చాలా బాధగా ఉంది. ఇది చాలా గడుసుది. ఒకసారి గోలచేస్తుంది. ఇంకొకసారి పోట్లాడుతుంది. మరొకసారి ఏడుస్తుంది. దీనితో నా మచ్చ మాస్తోంది. దీన్ని మీరే తీసికోండి బాబూ' అన్నాడు. సరే అని బ్రహ్మ ఆమెను తీసికొన్నాడు.

మరికొన్ని దినాల తర్వాత పురుషుడు మళ్లీ బ్రహ్మ దగ్గరకు వచ్చాడు. 'నాకేమీ తోచటం లేదంటూ గల్లంతుచేసి మళ్ళీ ఆ స్త్రీనే ఇవ్వమని కోరాడు. సరే తీసికో అని బ్రహ్మ ఇచ్చాడు. మళ్ళీ కొన్నాళ్ళకు పురుషుడువచ్చి, స్త్రీని తీసికో అని తన పాతపాట మొదలు పెట్టాడు. ఈ సారి బ్రహ్మకు నిజంగా కోపంవచ్చింది. 'ఒకసారి ఇవ్వు, ఒకసారి తీసికో అంటూంటావు. నీ మాట వినను. ఏమైనా సరే. నీ కెలా వీలో అలాగే స్త్రీతో కలిసిఉండు' అని కసిరి సమాధానం చెప్పి పంపాడు.

ఇదంతా పూర్వుల కథనం. ఈ కథ ఇలా ముందుకు సాగిపోతూనే ఉంటుంది. ఇంతకూ దీని సారాంశమేమంటే, 'మన మెవ్వరినైతే కోరుతూంటామో వారితో కలిసి ఉండటంలో అనేకంగా చిక్కులు కలుగుతూంటాయనిన్నీ, మరి వారు లేక పోతే ప్రపంచం శూన్యంగా కనబడుతుందనిన్నీ.' ప్రియజనులు ఉన్నా చిక్కే, లేకపోయినా చిక్కే. ఏవిధంగా చూచినా మనుష్యుడు సుఖంగా జీవించ లేడు. బహుశా ఇందువల్లనే కాబోలు బుద్ధ భగవానుడు ప్రపంచం దుఃఖభూయిష్ఠమని చెప్పాడు. Misery is greater than happiness. వస్తుత ఆనందమనేది భూమ్యాకాశములు కలిసినట్లు కనబడే దిగంతరేఖవంటిది. దానిని మనం దూరంనుండి చూడ గలుగుతాం. కాని పొందలేము. మనం దాని దగ్గరకు వెళ్లుతున్నకొలది అది ఇంకా దూరానికి పోతూంటుంది.

స్త్రీతో కలిసిఉంటే సుఖంగా ఉండవచ్చునని అనుకున్నాడు పురుషుడు. కాని, అలా ఉండలేక పోయాడు. ఎందుకంటే, స్త్రీతో కలిసిఉండటం ఎలాగో అతనికి తెలియటంలేదు కనుక. ఏమైతేనేం! ఆఖరికి అతని ఆశ ఫలించలేదు. మన అందరిస్థితి కూడా సరిగ్గా ఇలానే ఉంది. మనకు సాటివారితో కలసిఉండటం కుదరటంలేదు. మనం అనుక్షణమూ పెద్దపెద్ద ఆశలతో పెద్దపెద్ద కోరికలు కోరుతూ ఉంటాం. కాని, అవి నెరవేరటం మాత్రంలేదు. పర్యవసానం దుఃఖం మాత్రం మిగులుతోంది. ఈ విధంగా ప్రపంచమంతా నిరాశులూ, తీరనికోరికల వారితోనూ నిండిపోయింది. ఇటువంటి వ్యక్తులతో నిండిన ఈ విశ్వంలో సుఖజీవనం, సుఖజీవన విశ్వాసం లభించటమెలా ? కుమ్మరామలో రత్నాలు దొరుకుతాయా ?

ఒకరికి ఆర్థికదుఃఖముంటే, మరొకరికి అనారోగ్య దుఃఖం; ఒకరికి పుత్రశోకముంటే, వేరొకరికి భర్తృ మరణశోకం; ఒకరికి ఆశాసౌధాలు కూలుతూంటే, ఇంకొకరికి ఆదర్శవ్యక్తి ధర్మచ్యుతుడై ఆదర్శాల్ని మంటపాలుచేయటం. ఇలాంటివే ఏవో ఏవో దుఃఖాలు. ఏతాదృశ నిరాశలు, దుఃఖశోక తప్త చిత్తులుకలిసి, ఈ ప్రపంచంలో సుఖజీవనేచ్ఛ గగన కుసుమంవంటిదనే భ్రమకల్పించారు. ప్రాచీన ద్రష్టలు ఈ సత్యాన్ని బాగుగా ఎరిగినవారు కనుకనే "ప్రపంచాన్ని సుఖవంతంగా చేయాలంటే, వ్యక్తిని సుఖవంతునిగాచేయాలి; వ్యక్తి సుఖవంతుడుకావాలంటే, అతను తన పారస్పరిక సంబంధ వ్యవహారములను సుఖవంతములుగా చేయవలసిఉండును" అను నిశ్చిత మతమును స్థిరపరిచారు. ఏవంవిధభావనా ప్రవాహంలో ఈదులాడుతూ 'త్యాగము సర్వసుఖమూలము' అని నిర్వివాద సిద్ధాంతంచేశారు. మానవావలోకన ప్రయత్నంచేస్తూ వారు పరమాత్మవైపుకు సాగిపోయారు. వేదాంతం లేక అద్వైతమనే పేర్లతో వారు మనుష్యుని బ్రహ్మరూపంలో చూశారు. తర్వాత మనుష్యుని పూర్తిగా పరబ్రహ్మను చేసే విషయం ఆలోచింప మొదలుపెట్టారు.

పూర్ణత్వ పరిశోధన, పూర్ణత్వప్రాప్తి ప్రయత్నాలు నిరంతరం జరుగుతూనే ఉన్నాయి. మానవుడు విశ్వంయొక్క అధ్యయనం ప్రారంభించాడు. విజ్ఞానం పుట్టింది. అతడు సర్వవ్యాప్త సత్యాన్వేషణకై సాగాడు. ధర్మం జన్మించింది. ఆఖరికి మనుష్య స్వభావావలోకనకు మరలాడు. శాస్త్రం జనించింది. దీనినిబట్టి, యథార్థపరిశోధనాఫలం ధర్మం Religion is enquiry of Reality; మనుష్య స్వభావ పరిశోధనా ఫలం దర్శనము (శాస్త్రము) Philosophy is enquiry of Nature of Man; విశ్వపరిశోధనా ఫలం విజ్ఞానం — Science is the enquiry of universe అని గ్రహించాలి. ఈ మూడింటికిని సరియైన సమ్మేళనం జరిగితేనే జీవితముయొక్క సమ్యగ్దర్శనం సాధ్యంకావచ్చు.

ధర్మము, విజ్ఞానము, దర్శనము వీటి వివేచనకొరకు శిక్షా (చదువు) పద్ధతి పుట్టింది. శిక్షయొక్క ఉద్దేశ్యం శారీరక, మానసిక, ఆధ్యాత్మిక వికాసానికి మార్గం చూపటం. విద్యద్వారా మానవుడు పైమూటిలోనూ జ్ఞానం సంపాదించాడు. ధర్మ విజ్ఞానాల ప్రవాహంలోపడి తన్ను తాను మరిచిపోయాడు. ధార్మిక క్షేత్రంలో అతన్ని భ్రమ ఆవరించింది. ఆ మాయలోని చమత్కారం అతణ్ణి మాయామయుని చేసింది. విజ్ఞానం స్తనశల్య పరీక్ష చేయించింది. ధర్మ విజ్ఞానాల సుడిగుండంలోపడి మనుష్యుడు 'తనెవరో, ఏంచేయాలనుకున్నాడో' మరిచిపోయినాడు. పర్యవసానం ఏమంటే, మనుష్యుడు, మనుష్య సమాజ స్వరూపం బొత్తిగా మారిపోయినాయి.

ధర్మసంబంధ చర్చలవల్ల సాంప్రదాయాలు జన్మించాయి. అందువల్ల భిన్నభిన్న మతాలు వెలసినాయి. వాటికి మఠాలు, పీఠాలు స్థాపింపబడ్డాయి. ధర్మం ఇప్పుడు కేవలం చూపుడు గుఱ్ఱం అయిపోయింది. దాని పేరుమీదగా భోజనభాజన పానీయాలు మాత్రం మిగిలాయి. ధర్మాన్ని, పాపాల్ని కప్పి పుచ్చుకునేందుకు సాధనంగా వాడాలి, అనే వాదంకూడా ఒక మూల ఉంది. ప్రాతఃపూజ దినమంతా పాపాల్ని చేస్తూండటానికి బలమిస్తుంది; సాయంపూజ పగలంతాచేసిన పాపాల్ని ప్రక్షాళనం చేస్తుంది. చీకటి బజారు (Black Market) లో లక్షరూపాయిలు సంపాదించి, ఏదేవాలయుద్ధార నిర్మాణానికో రెండు మూడువేల రూపాయలు దానంచేసి, స్వచ్ఛమైన ధర్మాత్ములనే పేరు సంపాదించుకోటానికి చూస్తున్నారు. సమాజంకూడా అటువంటివారిని ధర్మాత్ములని వ్యవహరిస్తోంది. ధర్మోద్ధారకులని బిరుదులిస్తోంది. సత్యాన్వేషణపరమైన ధర్మం చేతిబీరమాదిరి పరిణమిస్తోంది. మనుష్యుడు బ్రహ్మవిచారణలో తన్ను తానే మరిచి కూర్చున్నాడు. ఈ విధంగా ధర్మసంహారమే ధర్మంగా చలామణి అవుతోంది! కాలమహిమ!

విజ్ఞానం అంతకంటే అధమస్థితిలో ఉంది. ధర్మం

పేరుతో చేయబడే అహితం, అన్యాయం నిషేధాత్మకమైందే. విజ్ఞానంద్వారా జరుగుతున్న అహితం మాత్రం విధ్యాత్మకమైంది. కార్య సామర్థ్యపుటూహతో మానవుడు యంత్రాల్ని కనిపెట్టాడు. కాని, అతను వాటికి దాసుడైనాడు. విశ్వసత్యాన్వేషణలో మనుష్యుడు ప్రపంచాన్ని మూలమూలలా గాలించాడు. అణుపరమాణులనుకూడా శోధించాడు. అటంబాంబు చేతికి చిక్కింది. మొదట్లో మనుష్యుడు తన పరివారాన్ని శోధించటానికిన్నీ, విశ్వాన్ని వృద్ధిచేయటానికిన్నీ బయలుదేరాడు. కాని, దాన్నే సంహారం చేస్తున్నాడు! నేటి విజ్ఞానం మనల్ని వినాశంవైపుకు లాక్కుపోతోంది. అది మన ఇరుగు పొరుగుల మారణాన్ని నేర్పుతోంది. ప్రపంచాన్ని తొందరగా పాడుచేయటం ఎలాగో తెలుపుతోంది. ఆఖరికి దీని పర్యవసానం ఏమిటి? అనే ప్రశ్నకు సమాధానం స్పష్టంగానే కనబడుతోందిగదా!

వైజ్ఞానికాభివృద్ధి అనే తీవ్రేచ్ఛవల్ల మనుష్యుని మనస్సు కావలసినంత వికాసాన్ని పొందింది. అతను తన అంతరాత్మను ఉపేక్షచేశాడు. అతని ఆలోచనలకును, భావాలకును మధ్య పెద్ద అగాధం ఏర్పడింది. అది పెద్దదేకాక అసాధ్యంకూడా అయింది. మానవు డెప్పుడూ ముందుకు పోవటానికే ఆలోచిస్తున్నాడు. నేటి విజ్ఞానవేత్త నిత్యనూతనావిష్కారాల్ని చేస్తున్నాడేకాని, వాటి పర్యవసానం మాత్రం ఏమిటో ఆలోచించటంలేదు. అతను ఉన్నతిని పొందుతున్నాడన్నమాటేకాని, దాన్ని ఏవిధంగా, ఏప్రతిఫలంఇచ్చి పొందుతున్నాడో గ్రహించటం లేదు. ఉన్నతస్థాయినందిన విజ్ఞానం మనుష్యునకు ఏమైనా ఇచ్చింది, ఏదైనా చేసింది. కాని, మనుష్యునిగా మాత్రం ఉండనీయలేదు.

యంత్రాలు బాగా వృద్ధిలోకి వచ్చాయి. నెలలు పట్టేపనులు ఘంటల్లోను, ఘంటలు పట్టే పనులు క్షణాలలోను జరిగిపోతున్నాయి. అయిదువందల మంది చేసేపనిని అయిదుగురే సఫలతా పూర్వకంగా నిర్వహించేస్తున్నారు. దీని పర్యవసానంగా మానవునకు అవకాశము, తీరిక ఎక్కువైనాయి. ఈ తీరిక వేళల్లో ఏంచేయాలో అతనికి తోచటంలేదు. ఈ విధంగా విజ్ఞానం మానవునకు నూతన సమస్యను తెచ్చిపెట్టింది.

ఈ యంత్రాల గంద్రగోళం ఇతర విషయాలను వేటినీ విననీయటంలేదు. మనం యంత్రాలు పని చేయటం చూస్తున్నాం; వాటి విపరీత ధ్వనిని వింటున్నాం. కాని, మన సాటి సోదరుని మాట మాత్రం వినలేకున్నాం. ఈ విజ్ఞానమనే వలలో చిక్కుకున్న మానవునకు తన సంగతి ఇతరులతో చెప్పటానికిగాని, ఇతరుల సంగతి తను వింటానికిగాని వీలు చిక్కటంలేదు. సాధ్యం కావటంలేదు.

విజ్ఞాన మూలంగా కలుగుతున్న చిక్కులన్నిటికీ ఒక భ్రమ కారణం. అదేదంటే, మానవుడు ప్రకృతిని జడమని భావించి, ఏవో కొన్ని సాధారణ సిద్ధాంతాల ద్వారా (Rule of average) ప్రకృతి నియమాలను జయించాలనుకోవటమే. అతను ఒక నది యొక్క లోతును అక్కడక్కడ నాలుగైదుచోట్ల కొలిచాడు. ఆ నదియొక్క సామాన్యపులోతు మొత్తంమీద నాలుగడుగులుంటుందని సిద్ధాంతం చేసుకున్నాడు. ఈ భ్రాంతితో కాలినడకమీద నదిని దాటటానికి బయలుదేరుతున్నాడు. పాపం! అతని సామాన్యపు కొలత కందనిచోట తన గతి ఏమౌతుందో అనే ఆలోచనే లేదతనికి!

ఇదేవిధంగా విశ్లేషణాత్మకంగా మనుష్యుని పరిశోధనకూడా జరిగింది. ఏయే పదార్థాలతో మానవ నిర్మాణం జరిగిందో, ఏది ఎంతెంత ఉందో, ఫాస్ఫరసు ఎంతో, ఇనుమెంతో, నీళ్ళభాగమెంతో ఇత్యాదులన్నీ ఆ పరిశోధనలో తెలిసాయి: "తన భార్యాపుత్రాదులను ప్రేమించటానికి, శరీరంలో ఉండే రాగి, ఇనుము, ఫాస్ఫరసు మొదలైనవి కారణం కావు. మన పరస్పర ప్రేమాకర్షణలకు మన మనుష్యత్వమే కారణం." అనే విషయాన్ని మానవుడు

తన వైజ్ఞానికపు టూహావిహారంలోపడి మరిచి పోయాడు.

శరీరం, మనస్సు, ఆత్మ వీటి వికాసంకొరకు పుట్టిన శిక్షాపద్ధతి కొన్నాళ్ళవరకు సరియైన మార్గంలోనే నడిచింది. కాని, కాలప్రభావంవల్ల అదికూడా జీవన విముఖమైంది. మీరే విద్యార్థినైనా కదిలించి 'ఏం నాయనా ! ఏంచేద్దామనుకుంటున్నావు ?' అని అడిగి చూడండి. అతడు తడుముకోకుండా వెంటనే జవాబిస్తాడు "ఏమోనండీ ! ఏమీ తోచటంలేదు" అని. ఈ నాటి విద్య ఏంచేయనక్కఱలేదో నేర్పుతోందికాని, మన జీవితంలో ఏంచేయాలో నేర్పలేక పోతోంది.

ప్రస్తుతపు విద్యాసంస్థల లేక విద్యార్థుల వార్షిక జీవిత సమయాన్ని అయిదు ముఖ్య భాగాలుగా చేయవచ్చు. ఎలాగంటే:—

1. రాజనీతి సమయం — ఈ సమయంలో భిన్న భిన్న సమితి సంస్థల ఎన్నికలు జరుగుతూంటాయి. ఇది జూలైనుండి సెప్టెంబరువరకు ఉంటుంది.

2. సామాజిక సమయం — ఇది అక్టోబరునుండి డిశెంబరు నెలాఖరువరకు ఉంటుంది. ఈ కాలం నాటకాలు, వినోదాలు, ఆటపాటలు, వాదోపవాదాలు, పోటీలు, ఫొటోలు, టీపార్టీలు మొదలైన వాటితో గడుస్తుంది. శాస్త్ర ప్రకారంగా వీటిని పాఠ్యప్రణాళికేతర విషయాలు Extra curricular. activities అనాలి.

3. భయసమయం—జనవరినెలనుండి మార్చి మధ్యవరకు దీనికాలం. ఈ సమయంలో పరీక్షా పిశాచం విద్యార్థుల నెత్తిమీద సవారీ చేస్తుంటుంది. విధి విరామాలుండవు. కూర్చున్నాగాని, పడుకున్నాగాని, నిద్రాజాగ్రదవస్థల్లోగాని పరీక్షలకలల్లో మునిగి తేలుతూంటాడు విద్యార్థి. పరీక్షల్లో తప్పతానేమో అనే భయంలో కృంగి కృశిస్తూంటాడు. ప్రశ్న పత్రార్జనా ప్రయత్నంలో నిమగ్నుడై పోతాడు.

4. ధర్మాచరణసమయం—పరీక్షల ప్రారంభంతోపాటే దీనికిన్నీ విఘ్నేశ్వరపూజ. ఈ రోజుల్లో విద్యార్థుల ఆస్తికత్వం, భక్తి శ్రద్ధలూ చూచితీరాలి. ప్రతి ఒక్కరూ ముడుపులు కట్టేవాళ్ళే; పంచభూతాల సాక్ష్యాలతో ప్రతిజ్ఞలు చేసేవాళ్ళే. పరీక్ష ప్యాసయితే కొబ్బరికాయలు కొట్టామనీ, కొండకొస్తామనీ, అప్పాలు పోయిస్తామనీ, అభిషేకాలు చేయిస్తామనీ, ఒకటేమిటి ! ప్రపంచంలో ఉన్న అన్ని మొక్కులూ ప్రత్యక్షమౌతూంటాయి.

5. ఉద్యోగసమయం — ఆరు నూరైనా, నూరు ఆరైనా, బమ్మిని తిమ్మినీ, తిమ్మిని బమ్మినీచేసి, పరీక్షల్లో ప్యాసయ్యేటట్లు చూసుకోవటం నేటి విద్యార్థి జీవిత లక్ష్యం. ఏదైనా ఒక ఉద్యోగం చేస్తూ ఉదరపూజ చేసికోటం కోసరమే విద్యార్థి పరీక్ష ప్యాసవాలని తాపత్రయపడుతున్నాడు. విద్యార్థిని (Lady student) అయితే మంచి భర్త లభిస్తాడని స్పష్టంగా చెప్పాలంటే, ఈ నాటి విద్యా సంస్థలు దినభత్యం సంపాదించుకొనే సాధనాలుగా గాని లేక వివాహంకొరకు ఎదురుచూడటానికి పనికివచ్చే విశ్రాంతి సత్రాలుగాగాని ఉపయోగపడుతున్నాయి.

ఈ ప్రకారంగా ధర్మం, విజ్ఞానం, విద్య ఈ మూడూకలసి, మనను చిత్రమైన స్థితిలోకి [illegible]దించాయి. మనకొక విచిత్ర సమస్యను సృష్టించాయి. మనుష్యుని గూర్చి పూర్తి పరిశోధన జరిగితేనేగాని ఈ సమస్య పరిష్కారంకాదని కొందరు తత్వజ్ఞులు నిర్ణయించి అందుకు పూనుకున్నారు. పరస్పర భావాదాన ప్రదానాలతో సంవత్సరాల తరబడి జరిగిన దీర్ఘ గంభీరాలోచనా పర్యవసానంగా కొన్ని భిన్న భిన్న సిద్ధాంతాలు చేశారు. వాటిలో ముఖ్యమైనవి నాలుగు.

1. కారల్ మార్క్సు సిద్ధాంతం — Marxion Theory - ఈ సిద్ధాంతం ప్రకారం మానవుడు తన ఆర్థిక పరిస్థితులకు దాసుడు. ధనాన్ని సాధించటంలోనే అతని సాఫల్య మిమిడి ఉంటుంది. ఇందులో మానవునకు వేరే వ్యక్తిత్వంలేదు.

2. పరిణామవాదం — Darwinion Theory - వానరవికసిత రూప పరిణామమే మానవుడు. మనుష్యుడు పశువుల సంతానం. పాశవిక వృత్తులతో అతను నిర్మింపబడ్డాడు. ఈ సిద్ధాంతం మానవుని ఆధ్యాత్మిక రూపాన్ని అంగీకరించదు.

3. ఫ్రాయిడ్ సిద్ధాంతం—Freudian Theory:- ఈ సిద్ధాంతాన్ననుసరించి మనుష్యుడు ప్రతి పనినీ మామూలుగా చేసేస్తుంటాడు. మనస్సు అతనిచే కార్యకలాపాల్ని చేయిస్తుంటుంది. అతను వృత్తులు లేక సహజాతములకు (Instincts) దాసుడు. ఈ సిద్ధాంతంలో బుద్ధికి, వివేకానికి స్థానంలేదు.

4. యంత్ర సిద్ధాంతం Instrumental Theory:- ఇందులో మనుష్యుడు అభ్యాసాలకు దాసుడు. అతన్ని ఏ పరిస్థితుల్లో ఉంచితే ఆపరిస్థితులకు అనుగుణ్యంగా నడుస్తుంటాడు. మానవుని కార్యశక్తి యంత్రశక్తి ముందు అత్యల్పం. ఈ సిద్ధాంతం మానవుని మస్తిష్కాన్ని, వివేచనాశక్తినీ ఒప్పుకోదు.

ఈ నాడు కనబడుతున్న భావపరంపరలో పైన చెప్పిన సిద్ధాంతాల ప్రభావాలు బాగా ప్రత్యక్షమాతున్నాయి. ఎలాగంటే:—

1. ఏ విధంగా బ్రతకాలో, బ్రతుకటంతో పాటు ఏం చేయాలో మనకు తెలియటంలేదు.

2. మన కాలమంతా పొట్టకొరకైన వెతుకులాటతో గడచిపోతోంది. అందువల్ల స్నాయు (నరాలు) సంబంధమైన అనేకరోగాలు పుట్టి వ్యాపిస్తున్నాయి.

3. యంత్రముల పనిముందు మనపని చాలాహీనం. కనుక మన దృష్టిలో మానవుడు పనికి మాలిన జీవి.

4. మనుష్యుడు పరిస్థితులకు దాసుడు. పశువుల నుండి మారుతూవచ్చినవాడు. కనుకనే అతనికి స్వతంత్ర వికాసం విశ్వాసంలేదు - ఇత్యాదులు.

ఇందువల్లనే ఈ 20 వ శతాబ్దంలో అత్యున్నత శీలియైన మానవుని హృదయంలో జీవితాశపూర్తిగా నశించిపోయింది. అతడు బ్రతకాలి కనుక బ్రతుకుతున్నాడు. కాని, జీవితంలో ఆకర్షణ ఉండీ మాత్రంకాదు. ఎందుకు బ్రతుకుతున్నాడో తెలియదు. బ్రతికి ఏం చేయాలో, ఏంచేయగలడో కూడ అతనికి తెలియదు. హఠాత్తుగా దృష్టిలభిస్తే ఏంచేయాలో తెలియని పుట్టుగ్రుడ్డివలె ఉంది నేటి సామాజికస్థితి.

వివిధాలైన కష్టాలయొక్క దుఃఖాలయొక్క భయ, బాధలతో బెదరిపోయిన మానవుని స్థితి, పెద్ద పొయ్యిమీద కాగుతున్న ఇసుకలో వేగే సెనగగింజ మాదిరిగా ఉంది. అది ఆ వేడికి ఆగలేక, పాపం! పైకి ఎగురుతుంది. కాని, గత్యంతరం కనబడక మళ్లీ అందులోనే పడుతుంది. ఆ సెనగకు ఆ ఇసుక, ఆ భాండీతప్ప వేరే ప్రపంచమేముంది ?

ఏ తావతా, మనసమస్య యథాప్రకారంగానే ఉండిపోయింది - సుఖవంతమైన సమాజ మెలా నిర్మింపబడుతుంది ?

ఈ సమస్యను మనం మరల నూతన దృక్పథంతో పరిష్కరించాలి. కాగా, "ఈ సమస్య వ్యక్తికి సంబంధించిందే కాని సమాజానికి సంబంధించింది కాదు" అనే పూర్వసిద్ధాంతాన్నే అంగీకరించి తీరాలి. మన పరిశోధన బహిర్ముఖంగా కాక అంతర్ముఖంగా ఉండాలి. గంభీరంగా సంపూర్ణమానవాధ్యయనం చెయ్యాలి. పూర్ణపరిశోధన లేనిదే సారాంశంగాని సిద్ధాంతంగాని తేలదు. సిద్ధాంతంలేని వాదం బాలప్రలాపం వంటిది.

మానవుని దుఃఖాలకు కారణం ఏమిటి ? అని ఆలోచించాలి ఇంక. సమస్త దుఃఖాలకు మన మనస్సు (మస్తిష్కం) మూల కారణమంటే మీరు అంగీకరిస్తారను కుంటాను. అది ప్రతివిషయాన్ని చిలవలు పలవలుగాను, కాస్తదాన్ని గంపంతగాను చేసి చూస్తుంది. కొత్త కొత్త కష్టాలను కల్పిస్తూంటుంది. ఈ కల్పనలమూలంగా మన మనస్సు అటూ ఇటూ తిరుగుతూ ఉంటుంది. ఒకచోటగాని, ఒక విషయం మీదగాని, ఒక వస్తువుమీదగాని ఆగదు. అప్పుడప్పుడది తన మనోరాజ్యంలో రకరకాల గాలిమేడలు

కూడా కట్టుకుంటూ ఉంటుంది. ఈ మానసిక చాంచల్యమే అన్ని దుఃఖాలకు పుట్టినిల్లు. కల్పనకు యథార్థానికి కలయిక చాలా తక్కువగా కనబడుతోంది కనుక. జీవితంలోని ఈ అనైకమత్యమే అన్ని దుఃఖాలకు కారణమవుతోంది. యుద్ధారంభంలో అర్జునునకు కలిగిన ఈ మానసిక చాంచల్యం మూలంగానే శ్రీకృష్ణభగవానుడు భగవద్గీత వంటి ఉత్కృష్ట గ్రంథాన్ని రచించి, అర్జునునకు వైరాగ్యాన్ని, అభ్యాసంద్వారా మనస్సును వశపర్చుకోవలసిందనిన్నీ ఆదేశోపదేశాలను ఇచ్చాడు.

మనశ్చాపల్యానికి గాని, మానవుని కష్టాలకుగాని అనేక కారణాలున్నాయి. మనం మనకష్టాలను గోరంతలను కొండంతలనుగా చేసి చూస్తున్నాము. దంభదర్పాలలో మునిగిపోయాం. పరిస్థితులను గూర్చి వ్యాకులపడుతున్నాం. లేకపోతే ఇష్టమైనవాటిని విడువవలసి వస్తోంది. సామాన్యంగా మన ఇరుగు పొరుగు వాళ్లే, లేక దగ్గిర సంబంధంకలవాళ్ళే మన దుఃఖాలకు కారణం అవుతున్నారు. ఎందుకంటే, వాళ్ళదగ్గర మనకంటె అధికధనం ఉంది. సమస్త విలాససాధనాలున్నాయి. ఉండటానికి మేడలు, పండటానికి పందిరిపట్టెమంచాలు, భుజించటానికి పంచభక్ష్యపరమాన్నాలు, తాగటానికి సిగిరెట్లు, సారా వగైరా నిషావస్తువులు మొదలైనవన్నీ ఉన్నాయి- ఇతరులెవరైనా తనకంటే సుఖంగా ఉంటుంటే చూచి దుఃఖపడటంలో మానవుడు మొదటినుంచీ సిద్ధహస్తుడు. ఆ విద్యలో సమర్థుడునూ. దుఃఖానికి మరొక కారణం రాగమోహములు. అనేకవస్తువులతో మనకు సంబంధముంది. వాటిని మనం స్వీయాలని భావిస్తున్నాం. కాని, వాటిమీద మనపెత్తనం మాత్రం సాగటంలేదు. అధికారవాంఛ దుఃఖాన్ని కలిగించటంలో అందెవేసిన చేయి అనునది స్పష్టమేకదా !

మానవుడు మిడిమిడి జ్ఞానంవల్ల దుఃఖపడుతూంటాడు. లేకపోతే అతడానందస్వరూపుడే. తను దుఃఖవంతుడను స్థిరమైన ధారణ అతని కెప్పటినుంచో ఏర్పడిఉంది. అందువల్ల అతను కష్టపడుతున్నాడు. లేకపోతే అతనికి దుఃఖంతో పనేముంది? తన బుద్ధిని సరిగా వినియోగపరుచుకుంటే అతనెప్పటికీ నిర్లిప్తుడుగా ఉండగలుగుతాడు.

ఇప్పటికి శాస్త్ర, సిద్ధాంతపక్షాల చర్చఅయింది. కాని, మన వ్యావహారిక జీవన రంగంలో సుఖం అంటూ ఉందా ? వస్తుందా ? ఆఁ వస్తుంది. తఱచుగా వస్తూంటుందికూడా కాని అంతకంటే అల్పసుఖప్రాప్తి, గతసుఖానుభూతిస్మృతి, భవిష్యత్ దుఃఖకల్పన మొదలైనవి నిరాశాజనిత దుఃఖాలకు కారణాలు అవుతూంటాయి. సుఖం భౌతికమనే భ్రమలో ఉన్నందున సుఖం ఎక్కడినుంచో రావాలని కోరుతున్నాం. ఈ పుస్తకం చిన్నది, ఈ పుస్తకం పెద్దది, అని అంటున్నట్లే, సైకిలు సుఖంకంటే మోటారు సుఖం ఎక్కువని అంటం మొదలుపెట్టాము. శారీరకసుఖానికి మితి, మానసిక సుఖానికి క్షతిలేదనే సత్యాన్ని మనం మరిచిపోతున్నాం. ఆనందరూపమైన మానసికస్థితివల్లనే మనుష్యసృష్టి ఈశ్వరసృష్ట జగత్తులో సర్వోత్కృష్టమని చెప్పబడింది. ఆధ్యాత్మికులు మానవుని పరమాత్మను ప్రతిరూపమన్నారు. భారతీయ దార్శనికులు వానిని బ్రహ్మరూపమన్నారు. ముసల్మానులు ఆదంలో అల్లా యొక్క ప్రతిబింబాన్ని చూచి "ఆదం అల్లా కాకపోతే, అల్లాకూడా ఆదంకంటే భిన్నుడుకాద"ని అన్నారు. ఆఖరికి యూరపుదేశస్థుల క్రీస్తుకూడా మనుష్యుడే కదా !

వాస్తవానికి మానవునకు అపారమైన శక్తిఉంది. కాని, కాల్పనికమైన, అసత్యమైన, భౌతికమైన సుఖచక్రంలోపడి, అతను తన బలాన్ని మరిచిపోతున్నాడు. వేదాంతులు దీనినే మాయాజాలమన్నారు. ఈ మాయాజాలంలో చిక్కుకోకుండా, తామరాకులో నీరువలె నిర్లిప్తుడై ఉండగలిగితే ఏ చిక్కూ ఉండదు. ఈ సాధారణస్థితిని దాటిన మానవుడు ఆత్మారాముడై పరమాత్మతో ప్రత్యక్షంగా సంభాషిస్తున్నాడు. అతడు చిత్రకారుని రూపంలో ప్రకృతిలోని సుందర చిత్రాలను సృష్టిస్తున్నాడు. ఆదర్శాన్ని ఆచరించటానికి మార్గదర్శకుడౌతాడు. తన్ను తాను సుఖపెట్టు

కోలేనివాడు ఈశ్వరదర్శనాధికారం తనకుందని ఎలా చెప్పగలుగుతాడు? అలాంటి వాడిని లోకమెలా విశ్వసిస్తుంది?

సంగ్రహంగా చెప్పాలంటే, దిక్సూచికాయంత్రం లేనందున దిక్కు తెలియక అగాధమైన అపారమైన సాగరంలో దారి తప్పి తిరుగుతున్న అంటమైన ఓడ వలె ఉంది మన జీవితస్థితి. స్థిరమైన మనస్సు అనే దిక్సూచి ఉంటే మనం భవసాగరాన్ని తరించి, ఈ దుఃఖాలనుండి విముక్తులం కావచ్చు. దుఃఖాలపీడ విరగడైపోతుంది. దుఃఖాలను తొలగించుకోటానికి ఒకేఉపాయం ఉంది. అది అధికారవ్యామోహాన్ని విడిచి త్యాగభావన వృద్ధిచేసుకోవటం. మన నిత్య జీవితంలోఅనాసక్తి (నిష్కామ)యోగాన్ని ఆదర్శంగా ఆచరిస్తూంటే మనం సుఖులం కాగలుగుతాం. అంటే, నేటి వికృత ధర్మ, విద్యా, విజ్ఞానాల వల్ల కాక శాస్త్రముల ద్వారా మన జీవనమార్గం నిర్దేశింపబడి నిర్మింపబడితే మనం సుఖవంతులుగా ఉండగలుగుతాం.

ఇది మేము కొత్తగా చెప్పినవిషయంగాదు. అనేకమంది ఆచార్యులు, ప్రవక్తలు అనేకవిధాలుగా చెప్పుతూ వచ్చిన సనాతనాదర్శమే. ఇది చిరంతన సత్యం కనుకనే నేటికినీ చెక్కుచెదరక అనంత సౌందర్యంతో నిలిచి ఉంది. దీనివ్యాఖ్యలు, విమర్శలు నేటికినీ మాసిపోలేదు. వసివాడలేదు. పాతపడిపోలేదు.

అనాసక్తిత్వం లేనిదే జీవితం సుఖంగా గడువజాలదనే సత్యం మనకు తెలిసినప్పటికినీ, మనందాన్ని అవలంబించటంలేదు. ఈ అనాసక్తియోగమనేది చాలగొప్పదే. చెప్పటానికీ, వింటానికీ చాలా తేలికైందే. కాని, ఆచరణలోమాత్రం దీన్ని మింగివేసే లంకెలు, జంజాటాలు తటస్థపడుతూంటాయి. అనాసక్తిత్వం అదృశ్యమై అంతరించి పోతుంది. ఇందువల్లనే ఈ చర్చలన్నా, సిద్ధాంతాలన్నా లోకానికి నమ్మకం పోయింది. ఏసిద్ధాంతమైనా, ఏవస్తువైనా వ్యావహారికరూపంలో కనబడకపోతే ఎవరాచరిస్తారు? ఎలా అనుకరిస్తారు? ఎవరైనా త్రాగుబోతు మద్యపానంలోని దోషాల్ని గురించి ఉపన్యాసమిస్తానంటే, తగుదునమ్మా అని వింటానికెవడు సిద్ధంగాఉంటాడు? గాంధిమహాత్ముడు అహింసను, అనాసక్తియోగాన్ని ఆచరించి చూపాడు కనుకనే ప్రపంచం ఆయన మాటను వేదవాక్కుగా శిరస్సున ధరించింది. మనమంతా త్యాగం, తపస్సు, పరమాత్మ మొదలైన విషయాలు రాత్రింబవళ్లు చర్చిస్తూంటాంకాని, ఒక్కక్షణమైనా ఆచరించం. ఇందుకనే మనమనస్సే మనల్ని నమ్మటంలేదు. ఈనాటినాయకులన్నా, ధర్మోపదేష్టలన్నా ప్రజలకు భక్తిశ్రద్ధలు పోయినాయి. అమెరికాదేశపు ఎమర్సన్ అను సుప్రసిద్ధ విద్వాంసుడు ఈ సత్యాన్ని జ్ఞాపకం చేయటానికే "you want people believe in god, let people see what god can make you like." అని అన్నాడు అంటే, లోకులు భగవంతుని విశ్వసించాలి అని నీవనుకుంటే, భగవంతుడు నీకేం చేయగలడో నీవు చూపించాలి అని.

అనాసక్తికి అధికారవ్యామోహం గర్భశత్రువు. అష్టమ చంద్రుడు, నైధనతార. అధికారం పోతుందేమోననే భయమే. అనాసక్తిత్వాన్ని దగ్గరకు చేరనీయదు. మనం ఏ పరిస్థితుల్లో ఉంటే, వాటిమీదే మన అధికారం ఉందని మన మూఢవిశ్వాసం. ఆ పరిస్థితుల్లో ఏ కొంచెమైనా మార్పు రాకూడదని మన ఉద్దేశ్యం. ఒకప్పుడు పరిస్థితులు మారుతాయేమో అనే భయంబాధిస్తుంది. మరొకప్పుడు జరామరణాల భయం వేధిస్తుంటుంది. ఒకసారి అధికారాన్ని ఎవరైనా లాక్కుంటారేమో అనే భయం కృంగతీస్తుంటుంది. మరొకసారి తనను గురించి సంఘం ఏమనుకుంటుందో, అనేభీతి సతాయిస్తుంది. 'సర్వం వస్తు భయాన్వితం భువి నృణాంవైరాగ్యమేరా భయం' ఇంతకూ చెప్పదలచిందేమంటే, సర్వకాల సర్వావస్థల్లోనూ అనేకవిధాలైన భయాలుమనల్ని ఆవరించి ఉంటాయని. ఇందుమూలంగానే మనల్నిమనం తెలిసికోలేకపోతున్నాం. ఎవరో కాని చాల చక్కగా అన్నాడు. మనుష్యునికి ఇతరులభయంకంటె తనవల్లనే ఎక్కువ

భయమని. మనం మనలోని అంధకారాన్ని చూచి భయపడి, అటు, ఇటుచూసే ప్రయాసపడుతున్నాం. చీకట్లో పోతూ భయపడ్డ పిల్లవాడు ఆంజనేయదండకం చదువుకుంటూ మనస్సును దానిమీదికి పోనిస్తాడు. అలాగే మనంకూడా మనమనసులోని చీకటిని చూడగానే బెదిరిపోయి, ఇతరవిషయాలమీదికి దృష్టిని మరల్చుతున్నాం. భయపడ్డబాలుడికి చీకటిలో ఉన్న ప్రతివస్తువు, ఆఖరికి పంకెన ఉన్న అంగవస్త్రంకూడా దయ్యంలాగా కనపడుతుంది. అలాగే మన మనస్సులోని అంధకారం మనకళ్ళకు నల్లద్దాల జోడు తగిలిస్తోంది. ప్రపంచమంతా అంధకారమయంగా కనబడుతోంది. ఎవరోమహానుభావుడు దీన్నే పాపంయొక్క రూపమని అన్నాడు.

దుష్టులెవ్వరో చూడంగ దొడరివెడలి
దేశదేశాల గాలించి, తెలియనైతి
తుదకునామదిన్ వెదుకగా దోచె నిటుల
అరయ నావంటి దుష్టులింకొరులులేరు.

మన మనసులోని భయమనే అంధకారం తొలగిపోతే మనకు ప్రపంచంలోని పాపరూపమైన దుఃఖసముదాయంకూడా తొలగిపోయినట్లే. మన మనస్సు ప్రసన్నం, ప్రకాశవంతం అయితే, ప్రపంచంకూడా ఆనందాబ్ధిలో ఓలలాడుతున్నట్లు కనబడుతుంది. 'తను సుఖంగా ఉంటే లోకమంతా సుఖంగా ఉంటుంది' అన్న దానికి అర్థం ఇదే.

నేటిమానవుడు విపరీతంగా భయగ్రస్తుడై పోయినాడు. భయభీతులైన మానవుల యొక్క సమాజం దుఃఖభూయిష్ఠమవటం సహజమే. మానవసమాజం సుఖవంతం కావాలంటే, సమాజం భయంలేని మానవుల్ని తయారు చేయాలి. మానవుడు సుఖవంతుడు కావాలంటే, భయాన్ని విడిచితీరాలి. మానవునకు మానవుడే అన్నిటికన్నా మించిన భయకారకుడు. నేడు మనిషికి మనిషిమీద విశ్వాసంలేదు. ఈ కారణంగానే అతడెప్పుడునూ నిత్యశంకితుడుగా, నిత్యభీతుడుగా ఉంటున్నాడు. మనం ఒకర్ని ఒకరు విశ్వసించగల్గితే నిజంగా సుఖులమే. ఈ విశ్వాసానికి త్యాగమే మూలాధారం. త్యాగంలేనిదే ఈలాగులాటలు పోవు. ఇవి పోకపోతే మనకు సుఖంలేదు. సమాజ సుఖానికీ, విశ్వశాంతికీ, విశ్వకళ్యాణానికీ గాను సుఖాభిలాషులు ఈ విషయాన్ని గంభీరంగా విచారించుదురుగాక.

# వాళ్ళనలా వదిలేద్దాం

శ్రీ నేమాని సంగమేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

"వసూ! వసూ" అంటూ కేక పెట్టేడు. బహుశ అనుకున్న దానికంటె ఎక్కువ గట్టిగానే!

పళ్లుతోము పుల్ల చెంబులో నీళ్లుతో ప్రత్యక్షమయింది వసుంధర.

అక్కడ స్టూలుమీద వాటిని పెట్టింది.

"ఎందుకండీ అంత పెద్దకేకలు! నేను ఎక్కడికయినా వెళ్లిపోయేననుకున్నారా? లేక మీకు తెలియకుండా ఎవరినయినా తెచ్చుకున్నాననుకున్నారా?" అంది అతి సహజంగా మర్మందాస్తూ.

"ఛీ! ఛీ! అలా నేనెప్పుడూ అనుకో లేదు! అనుకోనుకూడాను!" అన్నాడు ప్రభాకరం మరొక పక్క చూస్తూ.

"ఇందండి! ముఖం కడుక్కోండి. కాఫీ తాగి వెళుదురుగాని లెండి!" అంటూ నీళ్ళ పుడక అందిచ్చింది.

"అవునుగాని వసూ..." అడుగబోయి ఆగేడు నోట్లో పలుదోముపుల్ల నములుతూ.

"చెప్పండి! ఆగేరెందుకు?"

"అహ! ఏమీ లేదులే?"

"దాస్తారెందుకు? నేను ఎక్కడికి వెళ్ళేననా?" అంది కళ్ళలో చమకులు తిప్పుతూ!

"అదికాదు! పరుసలోది... అంతా చేక్కేసేవే అన్నాడు కొంచెం బెలుకుగా"

"ఓస్! అదా సంగతి! అంతా అంటే ఎంత? ... డెబ్బయి రూపాయిలేగా!"

"అవుననుకో."

"మరేం లేదు! ఒక చిన్న అవుసరం వచ్చింది! ఒకచోట అర్జంటుగా సర్దుబాటు చెయ్యవలసివచ్చింది! రెండు మూడు రోజులలో ఫిరాయిస్తానులెండి!" అంది రెండు చేతులూ ప్రభాకరం వెనుకనుండి బుజం మీద వేసి వేలబడుతూ.

"ఆ! ... అహ! ... అదికాదు ... అడిగేను ఊరికనే ... మళ్లా ఫిరాయించ నక్కరలేదులే! అయినా నువ్విచ్చేవ్! నేను పుచ్చుకున్నాను! రెండూ నిజమే!" సముద్రపుహోరులా నవ్వేడు. పళ్లుబయటకు కనిపిస్తునట్లు కృత్రిమంగా నవ్వుతూ అతని నవ్వుతో శృతికలిపింది వసుంధర.

ఇంటిదారి పట్టిన ప్రభాకర రావు వసుంధ

రను దమయంతిని ఒక తక్కెటలో వేసి తూస్తూ నడుస్తున్నాడు. త్రాసు ఎప్పుడూ దమయంతి ప్రక్కే మొగ్గు చూపిస్తున్నది.

తను నిన్న ఉదయం వచ్చి యింటికి వెళ్ళకుండా ఏంచేస్తున్నట్లు? ఎక్కడ తిరుగుతున్నట్లు? తన సామాను అవీ తననౌకరు స్టేషనుకు రాగానే వాడిద్వారా యింటికి పంపించేడు. తను చేస్తున్న రాచకార్యాలివి! తల్లిని లెక్కచెయ్యడు. తండ్రికి మాత్రం కొంచెం జడుస్తాడు. ఇంట్లో ఏమిక్షమాపణ చెపుదామా అని ఆలోచిస్తూ ప్రభాకరరావు దిక్కులు చూడకుండా దిగువకు రోడ్డుమాత్రంచూస్తూ జేబులో చేతులు పెట్టికొని తాపీగా నడుస్తున్నాడు.

“ఏంబాబూ! ఎప్పుడొచ్చేవ్?”

అన్నప్రశ్న తనకు వినబడగానే జేబులో చేతులుతీసి ఎదురుగా చూసేడు.

రఘునాధరావుగారు - దమయంతి తండ్రి. చిన్నకంగారు పడ్డాడు. వెంటనే తన్ను తాను సమాళించుకొని “నమస్కారమండీ! ఏది నిన్నమధ్యాన్నము మెయిలులో వచ్చేను! శేషగిరికనిపించి యింటికి తీసికెళ్ళేడు. మీరు అప్పుడు యింట్లోలేరు” అన్నాడు కొంచెము తడుముకుంటూ

“M B B S అయిపోయింది కదూ”

“ఆ! అయిపోయిందండీ!”

“ప్రాక్టీసు యిక్కడే పెడతావా బాబూ”

“ఏదీ ... ఇంకా నిశ్చయించలేదు!... అయినా యిక్కడే పెడదామనుకుంటున్నాను”

“సంతోషం నాయినా! అప్పుడప్పుడు మా యింటికి వస్తూవుండు!” అంటూ రఘునాధరావుగారు వెళ్ళిపోవడం చూసి Thank god అని అనుకుంటూ ముందుకు సాగుతున్నాడు ప్రభాకరం.

ఇంటి మెట్లు ఎక్కుతున్న ప్రభాకరం, హాలులో తనతండ్రి పేపరు చదువుకుంటూ కూర్చోడం చూసి కొంచెం “డంగయ్యేడు.” కాని ఆగిపోకుండా అడుగులు వేస్తూ యింట్లోకి దారి తీసేడు.

“ఏంరా ప్రభాకర్! నువ్వు ఈ వూరు వచ్చిందెప్పుడు? ఇంటికివస్తున్నదెప్పుడు?” అన్నాడు సీతాపతి కొంచెం కరుకుగా. భూమిపగిలినట్టు, అందులో తనుకూరుకుపోయినట్లు భావించేడు ప్రభాకరం.

“లేదు! లేదు! ... నాన్నా .... స్నేహితులు బలవంతం చేస్తే వాళ్లతో పిక్చరుకి వెళ్ళేను. రాత్రి అక్కడే పడుకున్నాను .....” అన్నాడు ఇనెస్పెక్టరు ముందు స్కూలు కుర్రాడు మాట్లాడుతున్నట్లు.

“చాల్లే వోయ్! స్నేహితులు! స్నేహి

తులు చట్టబండలయిన ట్లువుంది! నిన్ను బాగు చెయ్యడానికా? లేక పాడు చెయ్యడానికా వాళ్లు! లే! వెళ్లు!'' అంటూ పేపరు పేజీలు తిప్పసాగేడు తండ్రి.

''పోనీలే'' అని అనుకుంటూ తన గదిలోకి దారి తీసేడు ప్రభాకరం.

5

రాత్రి పదిగంటల తరువాత తనభార్య వచ్చి ప్రక్కను కూర్చోగానే హుషారుగా లేచి పేపరు ఒకమూల పెట్టి చుట్టముట్టించేడు రఘునాథరావు.

''ఏం! ఇవాళ ఇంతదయవచ్చింది. ఈ దీనుడిమీద?'' అన్నాడు నాటకాల వాళ్లలాగ.

''బాగున్నాన్ మాటలు! వయస్సు ముదురుతున్నకొద్దీ రసికత్వం ఎక్కువ అవుతున్నట్టువుంది!'' అందినవ్వుతూ. ఒక్క నిముషం తరువాత మళ్లా ఆమె ఇలా అంది. ''అవునుగాని ఈ సంగతి మీరు గమనించేరా?''

''ఏసంగతి?''

''అదే! మన దమయంతిసంగతి?''

''ఏం? ఏమయింది?'' అన్నాడు మామూలుగానే!

''మొగవాళ్ళకేమీ అంతగా తెలీదు– మాకు తెలిసినట్లు; మన అమ్మాయి ఏదో వ్యథ మనస్సులో పడుతున్నట్టువుంది! రోజురోజుకు కృంగి కృశించిపోతున్నాది. చూడండి దాని ముఖం! ఇదివరకులాగ కళాకాంతులు లేనేలేవ్! ఎప్పుడూ పరధ్యాన్నము – నిరుత్సాహం!'' అంది బాధ పడుతూ.

''నిజమే సుమీ? నేనూ అదికని పెట్టేను – దీనికేమంటావ్?''

''ఏమనడానికీ ఏముంది? 19 సంవత్సరములువచ్చేయ్! ఇంకా చదువుచదువు అని మొత్తుకుంటే ఎలాగు! ఆడదానికి చదువెందుకు చెప్పండి? ఇంకో రెండేళ్ళు చదివిస్తే అది పిచ్చెత్తిపోతుంది కూడాను! ఏ వయస్సులో ఏది వుండాలో అది వుండాలి! ...'' అంది భారంగా.

''అంతేనంటావా?''

''అంతే! నిశ్చయంగా అంతే! ఇంక ఈ చదువులు సంధ్యలు ఆపించి ఎవరికో ఒకరికి ముడి పెట్టేయండి! లేకపోతే...'' అన్న భార్యమాటలు కొంచం గాయపరచాయి రఘునాథరావును.

భర్త మాట్లాడకుండా మంచము మీద చేరబడడముచూసి తనూ తన మంచం మీదకి వెళ్ళి ముసుగుకప్పింది.

భార్య వెళ్ళిపోగానే ఆలోచనా సముద్రములో మునిగిన రఘునాథరావుకు ఒకదారి తెన్నూ కనిపించలేదు.

నిజమే ! తనూ అదే అనుకున్నాడు...

అయితే చదువూ సంస్కారముగలది తన కూతురు కాబట్టి తన జీవిత నిర్ణయం తనే చేసుకోకలదు అని అనుకున్నాడు. ఆడపిల్ల కావడంవల్ల శిగ్గుపడి బయటకు చెప్పలేక పోతున్నాదేమో !

తన భార్య ఎవరినో ఒకరిని ముడివేసెయ్యమని సులువుగా చెప్పింది. చెప్పడంలో మహాసులువుగా చెప్పింది ! కాని ఎవరో ఒకరు అంటే ఎవరు ? ఇది ఒకనాటి మాట కాదే ! జీవితంతో పోరు.

కళ్లు మూసుకొని ఆలోచిస్తున్న రఘునాధరావు ఎదుట సినీమారీలు తిరుగుతూ దమయంతికివరులు ఒకరి తరువాత ఒకరు కనిపిస్తున్నారు. ఆఖరికి ప్రభాకరరావు కూడా అందులో కనిపించగానే ఒక నిర్ణయానికి వచ్చేడు.

"ఏమే ! పడుకున్నావా ?" అన్నాడు భార్యను పిలుస్తూ.

ఆమె లేచింది. "లేదండీ ! మీరింకా పడుకోలేదూ !"

"ప్రభాకరరావునుగురించి నీ వుద్దేశమేమిటి ?"

"ఏం ! మంచివాడే ! సాంప్రదాయం కూడా మంచిదే. ఈడూ జోడూ బాగానే వుంటుంది."

"అయినా అమ్మాయిని ఒకమారు కదిపిచూడు ! సిన్న అబ్బాయి అతన్ని మనయింటికి తీసుకొచ్చి అతని ఎదుట అమ్మాయి చేత పాటపాడించి వారిద్దరికీ పరిచయం చేసేడట - అదీ ఒకందుకు మంచిదే అయింది-" అన్నాడు కొంచెం రిలీఫ్‌గా.

"అయినా కట్నకానుకలు ..."

భార్యమాటకు అడ్డువస్తూ "అవన్నీ నీకెందుకు? సీతాపతి నా చిన్ననాటి స్నేహితుడు. సరళహృదయుడు. మంచివాడు! బహుశా యిలాంటి లావాదేవీలేమీవుండకూడదు! ... అయినా అమ్మాయిదగ్గర ఒకమాటు ఈ విషయం ఎత్తిచూడు..." అంటూ తను నిద్రపోసాగేడు రఘునాధరావు.

ఉదయం దమయంతి లేచేసరికి హాలులో ఏదో గొడవ జరుగుతూవుంది. మేడగది బయటకువచ్చి బాల్కనీ గోడపట్టుకొని నిలబడిచూసింది.

పాలవాడు తల్లీ వాదించుకుంటున్నారు.

"నీళ్ళలో పాలుకలుపుతున్నావ్" అని తల్లి అంటే "లేదమ్మా ! పాలలో నేనీళ్లు కలుపుతున్నాను" అని వాడు క్షమాపణ చెప్పుకుంటున్నాడు.

తను నవ్వుకుంది. గదిలోపలకు వెళ్ళింది.

అద్దంలో ముఖంచూసుకొని, చీర సవరించుకొని మెట్లుదిగి కిందికి వచ్చింది దమయంతి.

“ఏం తల్లీ ! లేచేవా ! ముఖం కడుక్కో ! కాఫీ త్రాగుదువుగాని !” అంది తల్లి ప్రేమతో.

పేష్టు, బ్రష్ తీసుకొని టవలు భుజం మీద వేసుకొని బాత్ రూంలోకి నడిచింది దమయంతి.

పొగలు కక్కుతున్న కాఫీ ఒక్కొక్క గుక్కే తాగుతూ ఆలోచిస్తున్నాది దమయంతి.

(సశేషము)










# క్రొత్త నాణెములు

## 1957 ఏప్రిల్ 1 నుండి

| | ప్రస్తుతము చలామణిలో ఉన్న నాణెముల విలువ |
|---|---|
| 10 నయా పైసాలు—(1 రూ॥లో 1/10వ వంతు) | —1 అణా 7.2 పై |
| 5 నయా పైసాలు—(1 రూ॥లో 1/20వ వంతు) | —9.6 పై |
| 2 నయా పైసాలు—(1 రూ॥లో 1/50వ వంతు) | —3.84 పై |
| 1 నయా పైసా —(1 రూ॥లో 1/100వ వంతు) | —1.92 పై |

పైన చూపబడిన క్రొత్త నాణెములతోబాటు 1 కాని లేక 1/4 వంతు అణా, 2 కానులు లేక 1/2 అణా, ఒక అణా, 2 అణాలు (బేడ), 4 అణాలు (పావలా) మరియు 8 అణాలు (అర్ధ రూపాయి) — పాత నాణెములు కూడా చలామణిలో ఉండును. పావలా, అర్ధ రూపాయి నాణెములు వరుసగా 25 నయాపైసాలు, 50 నయాపైసాలు. కావున ఈ విధంగానే వాడవచ్చును. క్రొత్త నాణెములు పాత నాణెములు కూడా ఒకేసారిగా ఇచ్చుటకుగాని, మధ్య మధ్య ఇచ్చుటకుగాని వ్యాయ సమ్మతమైనవి.

### మార్చుకొనుటకు సౌకర్యములు

రిజర్వు బ్యాంకు ఆఫీసుల లోను, స్టేటు బ్యాంకు ఆఫ్ ఇండియా బ్రాంచిలలోను, ఇతర ఏజెన్సీ బ్యాంకులు, ట్రెజరీలు, సబ్ ట్రెజరీలలోను మార్చుకొనుటకు సౌకర్యములు ఏర్పాటు చేయబడును.

ప్రస్తుతము చలామణిలో ఉన్న 4 అణాలు(పావలా) దాని గుణజములైన 8 అణాలు (అర్ధ రూపాయి), 12 అణాలు (ముప్పావలా), 1 రూపాయి విలువగల నాణెములను మాత్రమే క్రొత్త నాణెములుగా మార్చుకొనవచ్చును.

## మారకపు పట్టీ

(ఇటీవల మార్పుచేయబడిన (1906 సం॥పు) భారతీయ నాణెముల చట్టము సెక్షను 14(2) ప్రకారము భిన్నాలు లేకుండా దగ్గర నయాపైసాకు సరిచూడబడిన) నయాపైసాల విలువలను క్రింది పట్టీ సూచించుచున్నది. అణాలు, దమ్మిళ్లు నాణెముల విలువను నయాపైసాలలో దగ్గర నయాపైసాకు మార్చవలెను. 1/2 లేక అంతకన్న తక్కువగానున్న భిన్నపు నయాపైసాలను విడిచి, 1/2 వంతుకన్న ఎక్కువగానున్నచో 1 నయాపైసాగాను చూచుకొనవలెను.

ఒక పర్యాయము అణాలు, దమ్మిళ్లలో ఇవ్వవలసిన విలువకు సరియగు నయాపైసాల విలువ.

| ప్రస్తుత నాణెములు అణా | పై | కొత్త నాణెములు నయాపైసాలు | ప్రస్తుత నాణెములు అణా | పై | కొత్త నాణెములు నయాపైసాలు | ప్రస్తుత నాణెములు అణా | పై | కొత్త నాణెములు నయాపైసాలు | ప్రస్తుత నాణెములు అణా | పై | కొత్త నాణెములు నయాపైసాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 0 | 3 | 2 | 4 | 3 | 27 | 8 | 3 | 52 | 12 | 3 | 77 |
| 0 | 6 | 3 | 4 | 6 | 28 | 8 | 6 | 53 | 12 | 6 | 78 |
| 0 | 9 | 5 | 4 | 9 | 30 | 8 | 9 | 55 | 12 | 9 | 80 |
| 1 అణా | | 6 | 5 అణాలు | | 31 | 9 అణాలు | | 56 | 13 అణాలు | | 81 |
| 1 | 3 | 8 | 5 | 3 | 33 | 9 | 3 | 58 | 13 | 3 | 83 |
| 1 | 6 | 9 | 5 | 6 | 34 | 9 | 6 | 59 | 13 | 6 | 84 |
| 1 | 9 | 11 | 5 | 9 | 36 | 9 | 9 | 61 | 13 | 9 | 86 |
| 2 అణాలు | | 12 | 6 అణాలు | | 37 | 10 అణాలు | | 62 | 14 అణాలు | | 87 |
| 2 | 3 | 14 | 6 | 3 | 39 | 10 | 3 | 64 | 14 | 3 | 89 |
| 2 | 6 | 16 | 6 | 6 | 41 | 10 | 6 | 66 | 14 | 6 | 91 |
| 2 | 9 | 17 | 6 | 9 | 42 | 10 | 9 | 67 | 14 | 9 | 92 |
| 3 అణాలు | | 19 | 7 అణాలు | | 44 | 11 అణాలు | | 69 | 15 అణాలు | | 94 |
| 3 | 3 | 20 | 7 | 3 | 45 | 11 | 3 | 70 | 15 | 3 | 95 |
| 3 | 6 | 22 | 7 | 6 | 47 | 11 | 6 | 72 | 15 | 6 | 97 |
| 3 | 9 | 23 | 7 | 9 | 48 | 11 | 9 | 73 | 15 | 9 | 98 |
| 4 అణాలు | | 25 | 8 అణాలు | | 50 | 12 అణాలు | | 75 | 16 అణాలు | | 100 |

పట్టీలో చూపిన విధముగా దగ్గర నయాపైసాకు సరిచూడబడినది. ఒక వ్యవహారము సొంతమైన పిమ్మట అణాలు, దమ్మిడీలలో ఇవ్వవలసిన ఏ మొత్తమైనను నయాపైసాలకు మార్చవలెను. కొత్త నాణెములలోగాని, పాత నాణెములలో గాని లేక రెండు చేర్చిగాని మీ అనుకూలమునుబట్టి మీరు ఇవ్వవలసిన డబ్బును ఈయవచ్చును.

కాబట్టి క్రింద చెప్పబడ్డ ఉదాహరణల ప్రకారం పూర్తిగా వ్యవహారము అయిన పిమ్మట మాత్రమే డబ్బు ఇవ్వవలసి వచ్చినప్పుడూ, చిల్లర తీసుకోవలసి వచ్చినప్పుడూ ఈ పట్టీని ఉపయోగించుకొన వచ్చును.

ఉదాహరణ : (ఇవ్వవలసిన మొత్తము అణాలు దమ్మిడీలలో ఉన్నప్పుడు)

ఒక్కొక్క వస్తువు 1½ అణా చొప్పున 12 వస్తువులకు ఇవ్వవలసిన మొత్తము 1 రూ॥ 2 అణాలు. కొనుగోలుదారుడు పూర్తి మొత్తమును పాత నాణెములలో ఇవ్వవచ్చును.

లేదా

1 రూపాయి 12 నయాపైసాలు (పట్టీలో చూపించిన ప్రకారము 2 అణాలు 12 నయాపైసాలకు సమానము) ఇవ్వవచ్చును.

పై ఉదాహరణలో కొనుగోలుదారుడు పూర్తిగా పాత నాణెములు 2 రూపాయల మొత్తమును ఇచ్చి మిగతా చిల్లర అడగవచ్చు. చిల్లర రావలసిన మొత్తము 14 అణాలు. ఇది పూర్తిగా పాత నాణెములలోగాని కొత్త నాణెములలోగాని ఇయ్యవచ్చు. లేదా కొంత పాత నాణెములలోను కొంత కొత్త నాణెములలోను ఈయవచ్చు. ఎనిమిది అణాలు పాత నాణెములలోను మిగిలిన 6 అణాలు క్రొత్త నాణెములలోను ఇవ్వబడునదనుకొనుడు. పైన చూపిన పట్టీని ఉపయోగించి 6 అణాలకు సరియగు 37 నయాపైసాలను కనుగొనుడు.

ఉదాహరణ : (ఇవ్వవలసిన మొత్తము నయాపైసాలలో ఉన్నప్పుడు)

ఒక వస్తువు వెల 11 నయాపైసాలు అయినప్పుడు దాని విలువ పూర్తిగా కొత్త నాణెములలో గాని లేక పాత నాణెములలో 1 అణా 9 దమ్మిడీలుగా గాని (పట్టిక ప్రకారము 1 అణా 9 దమ్మిడీలు 11 నయాపైసలకు సమానము) ఇయ్యవచ్చు.

ఒక వ్యాపారస్తుడు 11 నయాపైసాలు ఇవ్వవలసినప్పుడు 20 నయాపైసాలు ఇచ్చినచో అతడికి తిరిగి రావలసిన చిల్లర 9 నయాపైసాలు లేక పాత నాణెములలో దానికి సరియగు 1 అణా 6 దమ్మిడీలు.

నయాపైసాలు 11 ఇవ్వవలసినప్పుడు పావలా కాసును ఇచ్చి మిగతా చిల్లరను అడగవచ్చు. పావలా సరిగా 25 నయాపైసాలు. తిరిగి ఇవ్వవలసిన చిల్లర 14 నయాపైసాలు. ఇది పూర్తిగా కొత్త నాణెములలోగాని పూర్తిగా పాత నాణెములలో, 2 అణాల 3 దమ్మిడీలకు సరియగు 14 నయాపైసాలలోగాని ఇయ్యవచ్చు. లేదా ఒక అణా (6 నయాపైసాలు) & 8 నయాపైసాలు కొత్త నాణెములలో కూడా ఈయవచ్చు.

అణా దమ్మిడీలలోనున్న ఒక వస్తువుయొక్క రేట్లు లేక యూనిట్ ధరలను నయాపైసాలకు మార్చరాదు. ఇవ్వవలసిన మొత్తం డబ్బుకి సమాన నయాపైసాలు కనిపెట్టాలి.

ఉదాహరణలు :

ఒక్కొక్కటి 3 అణాల చొప్పున 50 వస్తువులను కొనినచో, మొదట రూపాయలు, అణాలలో మొత్తమును కట్టండి. మీరు అనిదంగా 9 రూ॥ 6 అణాలు ఇవ్వవలసి ఉంటుంది.

మీవద్దన అన్నీ నయాపైసాలే ఉన్నాయనుకోండి, 6 అణాలు, 37 నయాపైసాలకు సమానమని మీరు గమనించగలరు. కాబట్టి మీరు వెంటనే 9 రూపాయలు, 37 నయాపైసాలు ఇచ్చేస్తారు.

నయాపైసాలలో ఖరీదు కట్టినా సమానమే. 3 అణాలు 18¾ నయాపైసాలకు సమానము. దీనిని 50 చేత హెచ్చవేయవచ్చును. కాని 3 అణాలకు <u>భిన్నం లేకుండా పూర్ణాంకంగా</u> చూప బడిన నయాపైసాలు (19 నయాపైసాలు) తీసుకొని 50చే హెచ్చించడము తప్పు.

ఇలా విధంగా మీరు ఒక పత్రకుని వద్ద, ఒకేసారి వివిధ వస్తువులు, అణాలు, దమ్మిడీలలో చెప్పినచో <u>మొదట</u> మొత్తమును రూపాయి, అణా దమ్మిడీలలో వేరని కట్టండి. కొత్త నాణెములలో మొత్తమును ఇవ్వదలచుకొన్నచో, వేరని మొత్తములో అణా దమ్మిడీలలో మారకపు పట్టీని ఉపయోగించండి.

ఈ క్రిందివాటిని జ్ఞాపకముంచుకుంటే మారకములను సులభతరం చేసుకోవచ్చు.

| | | |
|---|---|---|
| 4 అణాలు | ...... | 25 నయాపైసాలు |
| 8 అణాలు | ...... | 50 నయాపైసాలు |
| 12 అణాలు | ...... | 75 నయాపైసాలు |
| 1 రూపాయి | ...... | 100 నయాపైసాలు |

ఉదాహరణలు :

(1) మీరు 10½ అణాలు ఇవ్వవలసినచోట మొదట 8 అణాలు లేక 50 నయా పైసాలు ఇచ్చి, మిగిలిన 2½ అణాలకు 16 నయాపైసాలు ఇవ్వాలి;

(2) నయాపైసాలు 36 ఇవ్వవలసి వచ్చినప్పుడు మొదట 4 అణాలు లేక 25 నయాపైసాలు, తరువాత మిగిలిన 11 నయాపైసాలకు ఒక అణా తొమ్మిది దమ్మిడీల లెక్క కట్టుకొని ఇవ్వవచ్చు.

DA 5/6 250 TG

# ఊర్వశి

'అర్జున్'

పక్షుల కిలకిల రావం తగ్గి - అపుడే సూర్యుడు తూర్పు కొండలనడుమనుండి తొంగిచూస్తున్నాడు. సూర్యభగవానుడికి అర్ఘ్యం సమర్పిస్తున్న సదానందుడు తనపని ముగించుకొని నదిలోనుండి గట్టు ఎక్కి నడక ప్రారంభించాడు.

సదానందుడు - లోకంలోని సర్వం పరిత్యజించిన నిష్కల్మషమైన సన్యాసి. సర్వసంగ పరిత్యాగి. ప్రతిదినం నగరంలో "మాతా భిక్షాందేహి" అని ప్రతి ఇంటి ఇల్లాలిని — దేహీ అని అర్థించి — ప్రాప్తించిన భిక్షతో ఆకలి బాధను నివారించుకోవడం అతని దినచర్య. ప్రొద్దుటే వెళ్ళి సాయంకాలానికి కుటీరం చేరడం పరిపాటి

ఓ నాడు అతను భిక్షాటన చేస్తూ ఓ మార్గాన పయనిస్తున్నాడు. నేలను చూపులునిగిడ్చి పాదచారుడై వెడుతున్న ఆ మానవునికి - అతని కర్ణపుటాలకు శ్రవ్యమైన సంగీతస్వరం వినిపించింది. ఏ వ్యక్తినైనా ఆ సంగీత ఆలాపన సమ్మోహితుని చేసేరీతిలోవుంది. ఆ సంగీతం చెవులబడిన సదానందుడు మైమరచి, దానికిలోలుడై నిలిచిపోయాడు. నాగస్వరానికి కట్టుబడ్డ నాగేశ్వరునిలా అతని హృదయం ఆ రాగాన్ని విన్నందుకు ఆనందం — ఉప్పొంగి పోయింది.

స్థాణువుగా మార్గమధ్యంలో నిలిచి వింటున్న సన్యాసికి ఆ మార్గాన ఓ మార్గస్తుడు వెడుతూండడం కనిపించింది. అతనా ప్రాంతీయుడనే భావనకలిగి ఆ వ్యక్తినిపిలిచి ఆ అమర సంగీతాన్ని ఆలాపించిన వ్యక్తి ఎవరో అడిగి తెలుసుకోవాలనే ఆశ జనించింది. ఆ వ్యక్తిని అడగ్గా తన వ్రేలెట్టి ఎడమ చేతి వైపునవున్న అంతస్తుల భవనాన్ని చూపి "అక్కడనుంచి ఆ సంగీతం వినవస్తుందని" తెలియజేసాడు.

"అందులో ఎవరున్నారు ? "

"ఊర్వశీదేవి ! "

"ఎవరు - ఊర్వశీ ! ఆమె దేవకన్యా ?"

"అయితే మీరీ ప్రాంతానికి క్రొత్తవారా ! మీకు తెలియదూ." అని ఆవ్యక్తి ఎదురు ప్రశ్న వేశాడు. సన్యాసి తల అడ్డంగా వూపాడు.

"ఆమె పేరు ఈ నగరంలో ప్రతివారికి తెలుసు !

"అయివుండవచ్చు కాని నాకు మటుకు తెలియదు యిప్పటివరకు" అతను చెప్పినదానిని బట్టి ఆ మహిళ ఇంద్రలోకంనుంచి దిగివచ్చిన ఊర్వశి-సౌందర్యవతి-సుగుణాలరాశి. ఆమె మధురగీతం, అమర నృత్యాలకు ధనవంతులు పాదాక్రాంతులట. ఆమె కాలి అందెల చప్పుడు ఎదుటివ్యక్తుల్ని ఆలోచనలోముంచి పిచ్చివాళ్లను చేస్తుందట. ఆమె సన్నిహితత్వాన్ని స్వర్గంగా భావిస్తారట. అని తెలుసుకొన్నాడు సదానందుడు.

♦ ♦ ♦

పర్ణశాలకు తిరిగివచ్చిన సదానందుడు - మహాగ్రంథాలలోని సారాంశం మరొక్కసారి చదివాడు. స్త్రీ సాంగత్యాన్ని విసర్జించిన మహనీయుల్ని - వారి చరిత్రను ముఖ్యంగా పఠించాడు.

తన మనస్సునుండి ఊర్వశీదేవిని, ఆమెను గూర్చిన భావనలు పారద్రోలాలని ప్రయత్నించి మరింతగా అదేపనిగా ఆ ఆలోచనల్లోపడి - అర్ధరాత్రికి - మగతనిద్రలోబడి - మిగిలిన రాత్రి వెళ్ళబుచ్చాడు.

మరుసటిదినం ప్రాతఃకాలం - దిన చర్య ప్రారంభించి - భిక్షాటనకు బయలుదేరి సరాసరి ఊర్వశి యింటికే సాగాడు.

ఆ భవనం - అత్యంత మనోహరంగా అలంకరించబడివుంది. లతలు చెక్కిన నగిషీపని యింటిగోడలెల్ల వున్నాయి. గోడలకు - ద్వార బంధపు తలుపులకు వేసినచిత్రలేఖనకు - అతను తబ్బిబ్బయినాడు. తిన్నగా ఎదుటివారు ప్రశ్నిస్తారనేయోచన లేక ఇంటి ప్రాంగణందాటి లోపలికి ప్రవేశించాడు. అతని అదృష్టమో లేక దురదృష్టమోగాని ఎదురు

పూలసజ్జనుబట్టుకొని అవలికేతెంచిన పరిచారిక అతని రాకనుచూచి — నిలిచి "ఆర్యా ! నమస్కారాలు" అంది.

"సుఖీ ! భవ !" అని దీవించాడు సన్యాసి.

"మహాత్మా ! కొంచెం వేచివుండండి. పూజా సామగ్రితోపాటు ఫలములు తెచ్చిసమర్పించెదను !" అని చెప్పి వెళ్ళడానికి సన్నిద్ధురాలైన ఆ పరిచారికను అతనునిలిపి "నేను మీ యింటికి భిక్షాటనకై గాలేదు. మీయజమానురాలను చూచి వెడదామని వచ్చాను" అన్నాడు.

ఆశ్చర్య చకితురాలై యజమానురాలితో సర్వత్యాగి అయిన ఈ సన్యాసికి పనేమిటో ఆలోచించి, ఎటూ నిర్ణయించుకోలేక యజమానురాలికి తెలియజేసింది.

ఊర్వశికి అది చెప్పగానే ఆ పుణ్యాత్ముని దర్శించి వస్తాను అని వచ్చింది.

♦ ♦ ♦

కాలి అందెలు గల్లుగల్లు మ్రోగించుకుంటూ ముందుకువచ్చే ఊర్వశిని - ఆ గదిలోనికి ప్రవేశించగానే తలఎత్తి ఆ వైపు చూచాడు సదానంద్. అతని హృదయం, ఆ ఊర్వశి సౌందర్యానికి దాసోహం అయి, కంపించి - ఆశ అనే విషవృక్షం - బీజంవేసి వ్రేళ్లు సాగించసాగింది. అతని హృదయం ఆమెను చూచి గాయపడింది.

సన్యాసిలోని మార్పుల్ని గమనించి ఊర్వశి "మహాత్మా ! మీరీ భవనానికి రావడం ప్రథమం అనుకొంటాను" అంది.

"అవును. నిన్నటిదినం, మీ స్వారానుభూతి పొందడం జరగడం సంభవించింది. మీ పాట ఆ మార్గాన వెడుతున్న నన్ను నిలిపివేసింది" అని తను అక్కడికి రావడానికి ముందు సౌకరించి సమాచారం ఆమెకు విపులంగా తెలియజేసాడు.

"అప్పటినుండి మిమ్మల్ని చూడాలని ఆశ జనించింది. నావల్ల కలిగే ఉపకారం ఏంలేదు. సాధు జంతువు - జింక ఏలా శ్రవ్యమైన సంగీతానికి చెవులు నిక్కరించుకొంటూ వింటుందో నేను అలాగే ... "

"ఆమె పెదవులపై చిరునవ్వు అంకురించి మరుక్షణంలో అంతరించింది. కాని ఆ నవ్వు అతని హృదయంలో గిలిగింతలు పెట్టినట్లయింది.

సాయంత్రం వరకు అక్కడేవుండి - రాత్రివేళకు కుటీరంచేరాడు సన్యాసి సదానంద్.

♦ ♦ ♦

మరుసటి దినంనుండి కాలకృత్యాలు తీర్చుకొనే - ఊర్వశి యింటికేగ మొదలుబెట్టాడు. సూర్యోదయంతో ఆ యింటి ప్రాంగణంలో అడుగుబెట్టడం, సూర్యాస్తమయానంతరం ఆ యింటినుండి యీవలకు వచ్చి కుటీరం చేరడం - కార్యక్రమంగా ఏర్పరుచుకొన్నాడు.

పగలల్లా - ఆ భవనంలోని ఉద్యానవనంలో వుంటూ, భవనంలోని ఊర్వశీదేవి దర్శనం అవుతుందేమో అని అటువైపు పరికిస్తూ, ఎపుడు అమృత గాత్రంవిప్పి పాడుతుందో వేచిచూస్తూండడంలో అతనికి ఎంతో ఆనందం అనిపించింది. ఆనందంగా వుండేవాడు.

ఊర్వశికిమట్టుకు ఆ సదానందుడి మార్పుల్ని చూచి దుఃఖించింది. సన్యాసి, సర్వం పరిత్యజించినవ్యక్తి, తన భౌతిక శరీర సౌందర్యానికి, ఐహిక సుఖాలను ఆకర్షించి - తన తేజోవంతమైన ముక్తిమార్గాన్ని విడిచిపుచ్చడం, ఆమెలో సంక్షోభాన్ని రేకెత్తించింది. అతను వీక్షణాలయినా, తన మతాన్ని విడిచి - ఐహిక సుఖాలకి దిగిపోవచ్చనే ఆలోచన ఆమెలో గాఢంగా నాటుకొంది. ఈ మాయ ప్రపంచంలోని మాయాజాలానికిలోబడి, ముక్తి మార్గాన్ని విడనాడడం ఆమెలో ఆలోచల్ని కలుగజేసింది. సన్యాసిని ఈ బాహ్య సుఖాలనే ఊబిలోనికి జారిపడకుండా ఏలా చేయడమో తెలియలేదు ఆమెకు.

ఒక రోజు సాయంత్రం — ఆ సంఘటన జరిగేటట్లు

ఏర్పరచింది. ఆ నాటితో సన్యాసికి తన మూసు కొన్న కళ్ళు తెరిపించడానికి యుక్తి పన్నింది.

గదిలో ఆసనంపై కూర్చుండి తన పాదాలచెంత దీపపు సెమ్మెతో జ్యోతిని వెలిగించింది. చక్కని పట్టు చీర గట్టింది. కూర్చుంది. చీర క్రిందిభాగం దీపపు జ్యోతిలోని అగ్నిహోత్రుని తాకింది. అగ్నిహోత్రుడు తన పనిని తాను కొనసాగించసాగాడు. ఆమె చీర ఆహుతి కాసాగింది.

అదే సమయానికి ఊర్వశితో చెప్పి యింటికి వెళ్ళడానికి వచ్చిన సదానందునికి ఆ దృశ్యం కళ్లకు కనుపించింది.

ఎలుగెత్తి "ఓ దేవీ ! మీ చీర మంటలోబడి ఆహుతి అవుతున్నాది" అని అరిచాడు.

ఆమె వినీ విననట్లు మిన్నకుండా కూర్చుంది.

తిరిగి అతను ఎలుగెత్తి అరిచాడు.

"ఆహుతి ! అయితే అయింది ! నా కళ్ళముందే ఎన్నలేని విలువగల ఓ వస్తువు బూడిదపాలై నసుసిపోతున్నాది. ఇక దీనిమాట ఓ లెఖ్ఖా !"

"ఆ వస్తువేమిటి ?"

"అదియే సన్యాస స్వీకార ఫలం. ముక్తికై ఐహిక సుఖాల్ని దూరంగానిలిపి, పొట్టనింపుకోడానికి భిక్షాటనచేసి నింపుకొంటూ, ఈ మాయ ప్రపంచంలోని సుఖాలను దూరంగా వుంచుతూ, శరీర సుఖాలను ఇంతకుముందే పారద్రోలిన మీరు, నా శరీర వ్యామోహంలోపడి, దగాపరచుకొంటున్నారు. మంచి ముత్యాన్ని మసిబొగ్గుగా పారద్రోసి — బురద మట్టితో నిండిన మట్టికుండకై మీ ఆత్మ పరితపింప జేస్తున్నారు. ఈ నాటికైనా కన్నులువిచ్చి నిజం తెలుసుకొండి. మీ యొక్క నిశ్శేష జీవితాన్ని ముక్తి సాధనకై వినియోగించండి" అంది ఊర్వశి.

ఆమె అన్న మాటలు అతనిలో చైతన్యం కలిగించింది. సాష్టాంగంపడి ఆమెకు నమస్కరించి "తల్లీ! ఇంతవరకూ మీ సౌందర్యానికి జోహార్లు అర్పిస్తూ మీ భౌతిక సుఖాలనుచూచి ఆనందిస్తూ, నా పవిత్ర కార్యక్రమాన్ని మరిచిపోయిన మూఢుడ్ని. నా మైకం వదిలించారు—"అని చేయెత్తి నమస్కరించి నిష్క్రమించాడు.

ఆ తరువాత తిరిగి సదానందుడు ఆ ప్రాంతంలో మరెప్పుడు కనిపించలేదు. ఆ నగరాన్నే శాశ్వితంగా విడిచి వెళ్ళిపోయాడు.

(200-వ పేజి తరువాయి)

గారు చివరకు మద్రాసుకు వచ్చి, హిందూ యువతీ శరణాలయమును స్థాపించి బీద స్త్రీలను, పిల్లలను పోషించసాగిరి. వార్తా పత్రికను స్థాపించిరి. కాన్ఫరెన్సులను పెట్టి నిర్వహించిరి. కళావంతుల సంఘ సంస్కరణోద్యమం సాగిపోతూ వచ్చినది.

ఉద్యమాన్ని స్థాపించిన మూడుసంవత్సరాలలో మూడువందల (సూ)ఖై వివాహాలు జరిగాయి. విశాలాంధ్రలో మూడు సంస్కరణ కేంద్రాలు ఏర్పడి, వివాహాలు సర్వసాధారణంగా జరిగిపోవుచుండినవి. 1930 సంవత్సరం నాటికి వుద్యమం విస్తరించి, కళావంతుల సంఘం ముందుకు సాగిపోతూవుండెను. తిలకమ్మగారి సహాయంకూడా అవసరం లేకపోయింది. మద్రాసులో ఆమె ఒక అనాధ శరణాలయమును, ఒక స్కూలును మానవ సేవాపరుల సహాయంతో చాలా కాలం జరిపించిరి. దేశ స్వాతంత్ర్యోద్యమంలో ఎక్కువగా సేవ చేయుచు జెయిలుకు వెళ్ళిరి. చనిపోయినప్పుడు ఆమెకు 69 సంవత్సరాల వయస్సు. అప్పటివరకు ఖద్దరుబట్టలనే ధరించుచు, చర్కా త్రిప్పుచు, గాంధి మహాత్ముని పూజించుచుండిరి. సంఘసేవ, దేశసేవ, మానవసేవలు చేయుచూ జీవితమును అభ్యుదయ మార్గంలో గడిపిన ధన్యురాలు తిలకమ్మగారు.

ఆంధ్రదేశంలో గాంధి శిష్యురాండ్రు కొందరు ప్రజా వుద్యమాలలో సేవ చేయుచూ, విద్యా సంస్కరణ సంఘములను స్థాపించి అమోఘమైన మానవ సేవ చేశారు; చేయుచున్నారు. అలాంటి వారిలో శ్రీమతి యామినీపూర్ణ తిలకమ్మ గారు అద్వితీయులు. ఆమె సేవ తరతరాలుగా జ్ఞాపకముండులాగున ఆంధ్రులము ప్రయత్నించుట మంచిది. ఈ నా అభిప్రాయంతో ఏకీభవించువారెం(ద)రో వున్నారని నా నమ్మకము. అలాంటివారు నాకు వ్రాయవలసిందని ప్రార్థన.



(176-వ పేజీ తరువాయి)

అన్నారట. ఆ మేనేజరు కాళ్ళవేళ్ళ పడి ప్రతి మాల సాగేసరికి చీట్లువేసి చూడండి; బాబా ఆ దేశము మీకే తెలియగలదు" అన్నారట. ఆ చెక్కు తీసికొనుట కనుకూల ప్రతికూలంగా కొన్ని చీట్లు వ్రాసి భార్యచేతనే ఒక చీటి తీయించేసరికి 'వద్దు' అని వచ్చేసరికి భయకంపితుడై స్వామిజీ దర్శనానికెళ్ళి "స్వామీ! ఉన్నతోద్యోగానికి ప్రయత్నిస్తూ బాబా అనుగ్రహ కటాక్షముల నర్థించి పూజారాధనకైంకర్యానికని యీ రు. 100/- పంపాను. కాని అది ఎందుకు నిరాకరించబడినదో..." అన్నాడట చేతులు నలుపుకుంటూ.

స్వామిజీ "అయితే ఆ యుద్యోగానికి ప్రయత్నము చేస్తున్నవారికెవరైనా నీకంటె మీ ఆఫీసులో అర్హులు, యోగ్యతకలవారున్నారా" అని అడిగాడట.

"ఉన్నాడు. నా కంటె సీనియర్ ఉద్యోగి, అర్హుడున్నాడు."

"అయితే న్యాయంగా ఉన్నతోద్యోగానికి నీ కంటె అర్హత కలవానిని త్రోసి పుచ్చి నీకు ఆ ఉద్యోగము నిచ్చుటకుగాను బాబాకు రు. 100/-లు యివ్వదలచావన్నమాట."

ఆ మేనేజరు తన తప్పును గుర్తించి పశ్చాత్తాప పడి సాష్టాంగ దండప్రణామములు చేయగా స్వామి కేశవయ్యగారు "న్యాయానికి, ధర్మానికి, సత్యానికి విరుద్ధమైన కార్యాలను శ్రీ బాబా ఎన్నడు ప్రోత్సహించడు; సహాయపడడు" అని చెప్పి పంపేశాడట.

◆ ◆ ◆

సాయుధ బలాలలోని ఒక సార్జంటు నేరాలు మోపబడి ఉద్యోగము కోల్పోయాడు. ఆయన నేరాలు మూడు సంవత్సరాలు విచారించబడినవి. విచారణ ప్రారంభంలోనే స్వామి కేశవయ్యగారి శరణు జొచ్చాడు. ఆ సాంతంలో తనకట్టి శిక్ష లేకుండానే విడుదల కాగలవని స్వామిజీ యిచ్చిన అభయం ప్రకారమే మేజరుపై మోపిన నేరాలు తేలిపోయినవి.

ఒక స్టేటుబ్యాంకి ఆఫీసరు భార్య 13 సంవత్సరాల కాలము సంతానము లేక దైవజ్ఞుల ఆదేశాల ననుసరించి ఎన్నో శాంతులు చేయించింది. చివరకు ఒకనాడు స్వామి కేశవయ్యగారిని దర్శించి తనకు గల సంతానేచ్ఛను తెలియజేసింది. వారు ఆమెను 7 గురు వారములు బాబా దర్శనమునకు వచ్చునట్లు ఆదేశించారు. ఏడవ వారమునాడు విభూది పొట్లము లిచ్చి భద్రముగా చెంత నుంచుకొనవలసినదిగా ఆదేశించి, 13 నెలల తర్వాత బాబా అనుగ్రహంవలన పుత్రుడు జన్మించగలరని చెప్పారు. అలాగే పుత్రుడు కలిగాడట. ఆగామి, సంచిత, ప్రారబ్ధ కర్మలలో దేనికి గురియైనవానినైనను బాబా రక్షించగలడు.

◆ ◆ ◆

ఒక భక్తుడు స్వామిజీ దగ్గరకు ఉద్యోగమునకై దరఖాస్తు పెట్టుకుంటున్న కుమారుని పిలుచుకొని వెళ్ళి ప్రయత్నము ఫలించునట్లు ఆశీర్వదించవలసినదిగా కోరారు. స్వామిజీ విభూది యిచ్చి ఆశీర్వదించి పంపగా బాబా అనుగ్రహంవలన ఉద్యోగ ప్రాప్తి మాత్రమే కాక విదేశములలో ట్రైనింగ్‌కై రష్యా దేశానికి పంపబడ్డాడు.

గుంటూరు జిల్లాయందలి పంచాయతి సభ్యుడు స్వామిజీని దర్శించి పంచాయతి ఎన్నికలలో తనకు జయము కలుగునాయని అడిగాడు. సామ్విజీ ఆశీర్వదిస్తూ తప్పక జయము కలుగునని చెప్పి విభూది ప్రసాదమిచ్చారట. అలాగే విజేత అయినాడట. మరల ఆ ఎన్నిక చెల్లనేరదని అతనిపై తేబడిన అభియోగం సయితం స్వామీజీ చెప్పినట్లు క్రింది, పై కోర్టులలో వీగిపోగా అధ్యక్షుడుగా నుండిపోయాడట.

ఒక మధ్య తరగతి కుటుంబీకుడు పట్నవాస జీవితంలో చాలీ చాలని ఆదాయంతో బహు కుటుంబీకుడై నానా కష్టాలపాలగుచు, అప్పుల బాధ భరింపరానిదై స్వామీజీని శరణుజొచ్చాడు. "బాబా అనుగ్రహ కటాక్షాలు నిన్ను తప్పక రక్షించగలవు - భయపడవలసినదేమి లేదు" అని అభయ హస్తం యిచ్చారు. దరిమిలా ముంచుకపోతున్నంత భయాందోళనలు కలిగినా స్వామిజీమాత్రం "ఏదో విధంగా బాబా నిన్ను రక్షిస్తాడు" అని ధైర్యము చెప్పి అనారోగ్యమునుండి, ఆర్థిక దుస్థితినుండి, భయాందోళనలనుండి విముక్తిని ప్రసాదించి శాంతి సౌభాగ్యాలను ప్రోత్సహించసాగారు.

శ్రీ బాబా దివ్యశక్తి, మహిమ స్వామిజీ ద్వారా పీడిత ప్రజాభీష్ట సిద్ధికి, ఆరోగ్య సౌభాగ్యముల పెంపుకు వినియోగపడుచుండుట మానవులదృష్టమనియే చెప్పాలి.




**హరనాథ భగవానుడు:** శ్రీ ఆరకట్ల బ్రహ్మం. ప్రచురణ కర్తలు : ది కుసుమ హరనాథ సెంట్రల్ మిషన్, రాజమహేంద్రవరము. వెల రు. 1-4-0.

దివ్యపురుషుల జీవితచరిత్రలు జీవయాత్రలో ఆత్మవిశ్వాసమును, నైతిక సంపదను, దైవచింతను పెంపొందింపజేసి ఆదర్శనీయమైన వ్యక్తిత్వమును రూపొందించుటకు తోడ్పడుతుంటవి. అట్టిదే యీ గ్రంథము కూడాను.

దేవాంశములతో నొప్పిన కుసుమ హరనాథులు పీడిత ప్రజలలో నిస్పృహ నిరాశలను పారద్రోలి జీవయాత్రను సుగమం చేయడానికి, ముక్తిపథాన్ని అందుకోడానికి తమ లీలలను అందరు అవతార పురుషులు లాగ ప్రదర్శించి భక్తివిశ్వాసాలను పూరించారు. శ్రీహరనాథభగవానునిలీలలు ప్రజలలో ప్రేమసద్భావములను, విశాల దృక్పథాన్ని పెంపొందింప జేసి భగవత్కటాక్షమునకు పాత్రులనుగా చేసినవి.

ఈ పుణ్యమూర్తి చరిత్ర తృతీయభాగము (కాశ్మీరు కాండ) భక్తులకు భగవానుని జీవితచరిత్రా విశేషములను తెలిసికొనుటకు విశేషముగా నుపకరించగలదు.

**త్యాగమూర్తి:** 'కవిచంద్రులు' కోట సోదరకవులు. ప్రతులకు కవిచంద్ర గ్రంథమాల, 147 మింటు స్ట్రీటు మద్రాసు 1. వెల 0-8-0.

అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములుగారి జీవిత చరిత్రమును వస్తువుగా గ్రహించి రచించిన పద్యకావ్యము. ఆంధ్రుల పురోభివృద్ధి నుద్దేశించి ఆత్మార్పణము చేసిన త్యాగమూర్తిని సామాన్య ప్రజలు సయితము స్మరించుట కనువుగా యిందలి పద్యములున్నవి.

**టామ్ సాయర్ సాహస కృత్యాలు:** మార్క్ ట్వెయిన్ రచన కనువాదం. ప్రకాశకులు. శ్రీవేంకటేశ్వర బుక్ డిపో, 10 నరసింగపురం స్ట్రీటు, మద్రాసు 2. వెల 2-0-0

ఇందులోని సాహస కృత్యాలు చాలవరకు జరిగినవే – అందులోను రెండు మూడు గ్రంథకర్త స్వానుభవాలు. మిగిలినవి గ్రంథకర్త సహాధ్యాయులవి. గ్రంథకర్త యిద్దరు ముగ్గురు కుర్రాళ్ళ స్వభావాలను సమన్వయపరచి టామ్ సాయర్ గా రూపొందించాడు.

ఇది బాల బాలికల కని యుద్దేశించి రచించిన గ్రంథమయినా పెద్దవారు సయితము దీనిని తమ చిన్ననాటి చేష్టలను, యూహాపోహాలను జ్ఞాపకము తెచ్చుకొని ఆనందించుటకు యీ గ్రంథపఠనము తోడ్పడగలదు. ఈ నవలా కాలంలోని - 1836 ప్రాంతంలో పశ్చిమ దేశాలలోని బాలలకు, బానిసలకు యిందులో వివరించిర కొన్ని మూఢనమ్మకాలుండేవి. మూలాని కనువుగా అనువదించబడిన యీ గ్రంథము సరళమైన శైలిలో పాఠకుల నుత్సాహపరచునదిగా నున్నది.

# సంపాదకీయములు

## అభినందనీయము

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రజావసరాలలో ప్రధానమైన ఆహార ధాన్యాల ధరలు హెచ్చు పెరిగి పోవుటను అరికట్ట చర్య తీసికొనుటకు విముఖమైనా కేంద్రప్రభుత్వము పెరిగిపోతున్న ధరల నరి కట్టుటకు ఆసక్తి చూపుచుండుట అభినందనీయము.

ధరలు పెరుగుదల దృష్ట్యా అసాధారణ పరిస్థితులు ఏర్పడినచో ప్రజలకు తిండి గింజలను సరసమైన ధరలకు సప్లయి చేయుటకుగాను, పెరుగుదల దశలో నున్న ధరల నరికట్టుటకు విదేశములనుండి ఆహార ధాన్యముల దిగుమతి చేయ సమకట్టినది. దీనివలన ఉత్పత్తి దారులు నష్టపడెదరని యూహించుట అపోహ మాత్రమే. స్వార్థపరులు, పేరాశపరులకు కష్టమనిపించినా ప్రజలకు మాత్రము ప్రస్తుత ఆదాయ పరిమాణముల ననుసరించి ఎంతో మేలు చేకూరగలదు; ఉత్పత్తి దారులకు సయితము ధర్మసమ్మతమైన గిట్టుబాటు సయిత ముండగలదు.

ఈ సందర్భమున 5 లక్షల టన్నుల బియ్యము కొనుగోలుకు ఇండియా ప్రభుత్వము బర్మాతో ఒడంబడిక చేసికొనడం హర్షణీయము.

## జాతీయ గృహపరిశ్రమలలో శిక్షణ

కుటీర పరిశ్రమలులాంటి కుమ్మరి, కమ్మరి, మేదరి పరిశ్రమలలో శిక్షణ కేంద్రాల స్థాపన హర్షించతగినదే కాని ఆ కేంద్రాలు క్రమంగా కళాకారుని ప్రోత్సహించి, పోషించుటకు బదులు చేనేత పారిశ్రామికునివలె నిరుద్యోగినిగా, నిరాశ్రయునిగా చేయరాదు. యంత్రపరిశ్రమగా రూపొంద నవసరం లేకుండానే మానవ శక్తి సామర్థ్యాలు, కళాకౌశలము ప్రజావసరాలను తీర్చకలిగినంతకాలము శిక్షణ కేంద్రాలు కళాకారులు చక్కని పనితనంతో, ఆకర్షణీయంగాను ప్రజోపయుక్తంగా తమ తమ పరిశ్రమలను నిర్వహించుటకు శిక్షణ నివ్వాలి. మరొకలాగ జరిగిననాడు చేనేత పారిశ్రామికునకు తన పరిశ్రమకు వలసిన నూలు వగైరాలు లభ్యమైనా మిల్లు పోటీకి తట్టుకోలేక స్వవృత్తులను వదలుకొని యితరత్రా వృత్తులకై చూచుకోవలసిన పరిస్థితులు ఏర్పడినట్లే కుమ్మరి, కమ్మరి మేదర వృత్తులకుకూడ అదేగతి పట్టగలదు.

## ఆంధ్ర పట్టణాలలో మంచి నీటివసతి, డ్రైనేజి స్కీములు

ఆంధ్రదేశంలోని 11 మునిసిపాలిటీలకు మంచి నీటి సరఫరాను, 2 మునిసిపాలిటీలకు డ్రైనేజి స్కీముల నమలుపరచుటకు 45 లక్షల రూపాయల మేరకు అప్పులను మంజూరు చేయుటకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఆలోచిస్తున్నట్లు వింటున్నాము.

ప్రజల ఆరోగ్య సౌభాగ్యములకు మంచి నీటి సరఫరా, డ్రెయినేజి వసతులు అత్యవసరము. మురికి కూపాలుగా మాలిన్యముతో నున్న ఆంధ్రదేశంలోని పట్టణాలు క్రమంగా యిట్టి ప్రభుత్వ ఆర్థిక సహాయ వసతులనయినా వినియోగించుకొని పారిశుద్ధ్యానికి, ఆరోగ్య నిలయాలుగా రూపొందగలవని ఆశిద్దాం!

ప్రజల ప్రధానావసరాలలో నొకటైన మంచి నీటి సరఫరా సయితము ప్రతియొక్క నగరానికి అమరి ప్రజల అభ్యుదయ అభివృద్ధులు పెంపొందవలసియున్నవి.

## స్త్రీలకు విద్యావసతులు

గ్రామప్రాంతాల స్త్రీలకు ఉత్తమమైన గ్రంథాలను సంచార గ్రంథాలయాలద్వారా అందించడానికి ఆంధ్రప్రభుత్వము కృషిచేస్తుందని ఆంధ్రప్రదేశ్ విద్యామంత్రి శ్రీ పట్టాభిరామారావుగారు హామీయిచ్చారట. కాని అలా అందించిన గ్రంథాలు గ్రామప్రాంతాలలోని బహు కొద్దిమంది విద్యావంతులైన స్త్రీలకే వినియోగ పడగలవు.

గ్రామాలలో యిప్పటికింకా అవిద్య, అజ్ఞానము విస్తారముగా నుండగా వాని నిర్మూలనకు ప్రభుత్వము మొదట కృషిని ద్విగుణీకృతం చేసిననేకాని వారు అందించదలచుకొనిన ఉత్తమ గ్రంథాల సార్థక్యము అంతగా నుండదు. ఉత్తమ గ్రంథపఠనం ద్వారా వ్యాప్తి నొందగల విజ్ఞాన వికాసములను గుర్తించిన ప్రభుత్వము వాని నార్జించుట కవసరమయిన విద్యావసతులను రాష్ట్రవ్యాప్తంగా విస్తృతం చేయకలుగాలి.

## బాష్పాంజలి

శ్రీమతి యామినిపూర్ణ తిలకమ్మగారిని తెలియని సంఘ సేవకులు, జాతీయ సమరయోధులు చాల అరుదు. ఆమెకుగల ఉత్సాహం, ఆసక్తి సాంఘిక రంగంలో విప్లవాత్మకమైన సంస్కరణలను సాధించినవి. కళావంతుల స్త్రీలను కులవృత్తిగా నెంచబడే దానిని మాన్పించుటకు, వారిలో వివాహములను ప్రోత్సహించి నలుగురితోబాటు గౌరవ మర్యాదలతో సుఖజీవనం చేయడానికి ఆమె స్థాపించి నిర్వహించిన హిందూ యువతీ శరణాలయము, పత్రిక, ఉద్యమము మహోత్కృష్టమైనవని చెప్పాలి.

ఆమె సంఘ సేవిక, రచయిత్రి, కవయిత్రి, జాతీయసమరంలో వీరోచితంగా పోరాడిన నారీమణి. ఆమె మాట్లాడుతున్నా, ఏపనిచేస్తున్నా ఎదటివారిని ఉత్సాహపరచి కార్యాచరణకు ఉద్యుక్తులను చేసేది. ఆమె సద్భావము, సమీకరణశక్తి సంఘసేవకు నలుముఖాల వినియోగపడింది. ఆమెకు సంఘసేవయందలి ఆసక్తి నిర్విరామ కృషి ఆమె కవితా నైపుణ్యం రాణించుట కవకాశ మివ్వకపోయినా అవసాన దశలో 116 పద్యములు గల శ్రీ వేంకటేశ్వర శతకమును మరొక శతసహస్రమును రచించి పూర్తిచేయకలిగారు. అది త్వరలో ప్రచురణ కానున్నట్లు తెలుస్తున్నది.

దుఃఖసముద్రంలో మునిగియున్న ఆమె భర్త శ్రీ రామకోటయ్యగారిని, ఒకే ఒక కుమార్తె శ్రీమతి కనక దుర్గాదేవిని మా సానుభూతి సంతాపాలతో ఓదార్చుచు, తల్లి నిర్వహించిన ప్రజాహిత కృషిని కుమార్తె సయితము ఆమె అడుగుజాడలననుసరించి నిర్వహించవలయునని ఆశిస్తున్నాము.

శ్రీమతి యామినీపూర్ణతిలకమ్మగారి పవిత్రాత్మకు భగవంతుడు పరిపూర్ణశాంతిని ప్రసాదించుగాక!



# శ్రీ హేవళంబినామ సం॥ర చైత్ర, వైశాఖమాసములు

1957 సం॥ ఏప్రిలు నెల

| | | |
|---|---|---|
| 16 | మం | వి 22.13 విశా 50-58 తిథిద్వయం |
| 17 | బు | త 20.49 అనూ 51.55 తిరువళ్ళిక్కేణి పార్థసారథిస్వామి గరుడోత్సవం |
| 18 | గు | చ 20.41 జ్యే 54.5 |
| 19 | శు | పం 21.45 మూ 57.20 శూన్యతిథి-మత్స్య జయంతి |
| 20 | శ | ష 23.55 పూషా 60-10 |
| 21 | ఆ | స 27.3 పూషా 1-51 భానుసప్తమి |
| 22 | సో | అ 30.55 ఉషా 6.57 |
| 23 | మం | న 35.17 శ్ర 12.36 |
| 24 | బు | ద 39.53 ధ 18-34 |
| 25 | గు | ఏ 44-27 శత 24.35 జీవనారైకాదశి |
| 26 | శు | ద్వా 48.42 పూభా 30.23 త్యా 4.22 |
| 27 | శ | త్ర 52.21 ఉభా 35-40 వరాహజయంతి |
| 28 | ఆ | చతు 55.11 రే 40.14 మాసశివరాత్రి |
| 29 | సో | ● అమా 57.0 అశ్వ 43-51 పంచగ్రహకూటం |

## వైశాఖమాసము

1957 సం॥ మే నెల

| | | |
|---|---|---|
| 30 | మం | శుపా 57.37 భ 46.23 |
| 1 | బు | వి 56.59 కృ 57-41 |
| 2 | గు | త 55-3 రో 57-44 పరశురామజయంతి, పుష్పగిరి చెన్నకేశవస్వామి గరుడోత్సవం. |
| 3 | శు | చ 51-55 మృ 46.35 |
| 4 | శ | పం 47.40 ఆ 44.20 |
| 5 | ఆ | ష 42.30 పున 41.28 |
| 6 | సో | స 36-37 పు 37.13 |
| 7 | మం | అ 30.16 ఆశ్రే 32-50 |
| 8 | బు | న 23.44 మఖ 28.15 తిథిద్వయం |
| 9 | గు | ద 17-15 పూఫ 23-49 త్యా 3-44 |
| 10 | శు | ఏ 11-5 ఉఫ 19.37 |
| 11 | శ | ద్వా 5.27 హ 16.3 |
| 12 | ఆ | త్ర 0.35 ఏష్యం 55.56 నృసింహజయంతి |
| 13 | సో | ○ పౌ 53.45 స్వా 14.39 వ్యాసపూర్ణిమ, చంద్రగ్రహణము |
| 14 | మం | కృపా 52.17 విశా 11.5 త్యా 4.3 కంచివరదరాజస్వామి గరుడోత్సవం |
| 15 | బు | వి 52.2 అనూ 11.44 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు 4.50. న.పై. అర్థసంవత్సరపు చందా రు. 2-25 అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువమైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను.

రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.